

# దేవతల వాద్యనాదాలు ఆలకించండి!

దట్టమైన అడవులు, మేఘాలు దోబూచులాడే పర్వత శిఖరాలు, అందమైన సెలయేళ్ళు, అల్లనల్లనసాగే నదీ ప్రవాహాలు గల సిమిపాల్ అటవీ ప్రాంతం భగవంతుడి తొలి సృష్టిసామ్రాజ్యం! బ్రహ్మాండమైన ఏనుగుల ఘీంకార బాకాలు, రకరకాల అడవి పక్షుల చిత్ర విచిత్ర వాద్య బృంద సంగీతాలు, పులుల-చిరుతల గర్జనలు, ఉత్తుత్తి కన్నీళ్ళతో వాతావరణంతో శ్రుతికలిపే మొసళ్ళు!

వాటన్నిటినీ అభినందించడానికి సిమిపాల్‌కు చేరుకోండి.... పరవశం చెందండి!






mudra 1737

For details contact: Ph: 0674 2432177, e-mail: ortour@orissatourism.gov.in
website: www.orissatourism.gov.in

ORISSA

ప్రకృతి సౌందర్యం • ప్రశాంతం • మహోన్నతం

# A TREASURE-TROVE FOR TALENTED TOTS





JUNIOR
CHANDAMAMA

## THE ONE-STOP COMPLETE FUN AND ACTIVITY MAGAZINE

NOW AVAILABLE AT YOUR NEAREST NEWS STAND FOR RS.15 PER COPY



- Games, puzzles, riddles, stories, colouring activity and more...



- Good habits grow when young. Check out articles and features in which values are taught subtly and let your child learn about Indian culture and heritage.










- Pick up a copy of Junior Chandamama for interesting new stories and puzzles to be read out to the kiddies.

**PAY ONLY RS.150 FOR ANNUAL SUBSCRIPTION AND SAVE RS.30**



చందమామ సంపుటి: 59 ఫిబ్రవరి 2006 సంచిక:2



## ఈ సంచికలో...



### ఈ నెల విశేషాలు













## పాఠకులకు విజ్ఞప్తి

పెరిగిన కాగితం ధర, పత్రికా ప్రచురణకు సంబంధించిన వ్యయం పెరిగి పోవడం లాంటి కొన్ని అనివార్య కారణాల వల్ల పత్రిక ధరను, వెంటనే కొద్దిగా పెంచవలసి వచ్చింది. ఫిబ్రవరి 2006 నుంచి చందమామ విడి ప్రతి ధర రూ. 13లు. ఈ కొద్దిపాటి పెరుగుదలను సహృదయంతో అర్థం చేసుకుని, పాఠకులు ఎప్పటిలాగే మాతో సహకరించగలరని భావిస్తున్నాము. సంవత్సర చందా రూ. 150లు. ఈ రాయితీని పలువురు వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము.

- ప్రచురణకర్త



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# దేశప్రతిష్ఠను కాపాడుకుందాం!

మనదేశంలో ఉన్న ముప్ఫై పైచిలుకు రాష్ట్రాలలో, ఐదు రాష్ట్రాల శాసన సభలకు ఈ యేడాది ప్రథమార్ధంలో ఎన్నికలు జరుగనున్నాయి. ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామ్యదేశం మనది అన్న సంగతి తెలిసినదే. మనం రాజ్యాంగం రూపొందించుకున్న తరవాత మనల్ని పాలించే ప్రతినిధులను ఎన్నుకోవడానికి పార్లమెంటుకూ, అసెంబ్లీలకూ క్రమబద్ధంగా ఎన్నికలు జరుపుకుంటున్నాం.

ఇంతవరకు బాగానే ఉన్నది. అయితే, మనం ఎన్నుకుంటూన్న ప్రతినిధులు మన ఆశలకూ, ఆశయాలకూ అనుగుణంగా మసలుకుంటున్నారా అన్నదే ఇప్పుడు ప్రశ్నార్థకమయింది. అధికారం, ముఖ్యంగా సర్వాధికారం ఎలాంటి వారినైనా కళంక పరుస్తుందన్నదే అనుభవజ్ఞుల అభిప్రాయం. అందుకే ప్రజాస్వామ్యానికి పునాదుల్లాంటి ఎన్నికలు ఇవాళ ధనబలం, కండబలం ప్రదర్శించడానికి వేదికలుగా మారిపోయాయి. ఇది ఎంతయినా వేదన కలిగించే విషయం!

''భారతదేశం మహోన్నతమైనది. ఈ పుణ్యభూమిలో మనిషిగా జన్మించాలంటే ఎంతో పుణ్యం చేసుకుని ఉండాలి!'' అని మన విష్ణుపురాణం వేనవేల సంవత్సరాలనాడు ఉద్ఘోషించింది. అలాంటి మహోత్కృష్ట దేశ ప్రతిష్ఠను కళంకిత పరచే హక్కు ఏ ఒక్క భారతీయుడికీ లేదు.

మనల్ని మనం సరిదిద్దుకోవడానికి కాలం మించిపోలేదు. ఆ దిశకేసి వేసే తొలి అడుగుగా– నీతి, నిజాయితీ, నిరాడంబరత మొదలైన ఉన్నతమైన మానవతావిలువలకు ప్రాముఖ్యతనిచ్చి, భారత జాతి సంస్కృతీ సంప్రదాయాలను పరిరక్షించగల సచ్ఛీలురనే మన ప్రతినిధులుగా ఎన్నుకుందాం!

దిగజారుతూన్న దేశ ప్రతిష్ఠను నవతరం కాపాడగలదని చందమామ దృఢంగా విశ్వసిస్తున్నది!

సంపాదకుడు : విశ్వం





# పాఠకుల లేఖలు

చందమామ నా బాల్యం నుంచీ విడదీయరాని భాగంగా ఉంటోంది. మా నాన్న సంస్కృతం చందమామ చదువుతారు. చిత్రాల్లో జీవం తొణికిసలాడుతుంది. అందుకే అవంటే నాకెంతో ఇష్టం. కొన్ని చిత్రాల శైలిలో వైవిధ్యం కాస్త తగ్గిస్తే, పత్రిక రూపంలో మరింత ఒకే విధమైన పొందిక రాగలదని భావిస్తున్నాను. ఇటు పట్టణాలలోని పిల్లలూ, అటు పల్లెసీమలలోని పిల్లలూ చదివేలా ఉండడమే చందమామ ప్రత్యేకత. ఆ అంశమే నాకు బాగా నచ్చింది.

– మనీషా షేర్ గట్మన్, పూణే

మీ జూలై సంపాదకీయం చాలా బావుంది. పిల్లలు రోబోలు కాకూడదు. ఎంత గొప్ప సత్యం! ప్రస్తుత విద్యావిధానం గురించిన మీ అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ఆడుకునే వయసులో పసి హృదయాలపై ఎన్నో విషయాలను బలవంతంగా రుద్దుతున్నాం. అందుకే మనలా వాళ్ళు నేర్చుకున్నదాన్ని సరిగ్గా జ్ఞాపకం ఉంచుకోలేక పోతున్నారు. మన పిల్లలు జీవితానికి అవసరమైన తెలివితేటలు ఆర్జించాలా? కేవలం మార్కులు నిండిన 'కాగితం' సంపాయిస్తే చాలా? అన్న విషయం గురించి ఆలోచించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

– విద్యా బాగ్లోడీ, షార్జా, యుఎఇ

చందమామలో కథలు బావుంటాయి. జానపద కథలు, జాతక కథలు అంటే నాకెంతో ఇష్టం. మన దేశం గురించీ, మన సంస్కృతీ సంప్రదాయాల గురించీ తెలియ జేయడం చందమామ ప్రత్యేకత. మాతృదేశానికి దూరంగా ఉండడం వల్ల వాటిని గురించి చదవడం మాకెంతో ఆనందం కలిగిస్తోంది.

– అర్భాన్ రెహ్మాన్, స్వాజీల్యాండ్, ఆఫ్రికా

ఈ మధ్య బరోడా నుంచి రైల్లో వస్తున్నాం. మాతో ఒక తాత, తండ్రి, తల్లి, ఇద్దరు అల్లరి పిల్లలు ప్రయాణం చేస్తున్నారు. పెద్దలతో సహా వాళ్ళందరూ చందమామను క్రమం తప్పకుండా చదువుతామని మాట్లాడుకోవడం విన్నాను. అందువల్లే వాళ్ళు, భారతీయ సంస్కృతిని గురించీ, విలువల గురించీ పిల్లలకు కథల రూపంలో చెప్పగలుగుతున్నారట. ఇదీ చందమామ విజయ రహస్యం!

– కాంతలక్ష్మీ చంద్రమౌళి, చెన్నయ్



# మారిన మనసు

గజపతివర్మ పాలించే గిరిపురం రాజ్యంలోని రామవరం అనే చిన్న పట్టణంలో రమణయ్య అనే బట్టలవ్యాపారి ఉండేవాడు. ఆయనకు భార్యా, ధనశేఖరుడనే ఒక కొడుకూ, శాంతామణి, చింతామణి అనే ఇద్దరు కూతుళ్ళూ ఉన్నారు. పెళ్ళీడుకు వచ్చిన పెద్ద కూతురిని ఉన్న ఊళ్ళో కాకుండా, రాజధానిలో మంచి ఉద్యోగం చేసే వరుడికిచ్చి వివాహం చేయాలని రమణయ్య ఆశించాడు.

ఇలా ఉండగా, రమణయ్య ఒకసంబంధం గురించి విన్నాడు. రాజధానిలో రాజుగారి ఖజానాకు కాపలా భటుడిగా పనిచేస్తున్న దివాకరుడనే యువకుడు అందగాడు; అంతకు మించిన తెలివి తేటలు, ధైర్యసాహసాలు కలవాడు. అతడు కూడా వేరే ఊళ్ళోని అమ్మాయిని చేసుకోవాలని చెబుతున్నాడని రమణయ్యకు తెలియవచ్చింది.

వెంటనే రమణయ్య రాజధానికి బయలుదేరి వెళ్ళి, మూడు రోజులు అక్కడ బస చేసి దివాకరుడి వివరాలను సేకరించాడు. అతనికి తల్లిదండ్రులు లేరు. స్వయంగా కలుసుకుని అతని ఉద్యోగ బాధ్యతలు తెలుసుకున్నాడు. అతని మాటతీరుకు సంతృప్తి చెందాడు. తన కుమార్తెను గురించి చెప్పి, అతనికి చేసుకోవడానికి సమ్మతమైతే, రామవరానికి వచ్చి చూడమని చెప్పాడు.

ఒక వారం రోజుల తరవాత దివాకరుడు రామవరానికి వెళ్ళాడు. అతడు రమణయ్య ఇంటిని సమీపిస్తూండగా, ఇంటి ముందు గుమ్మంలో ముగ్గు వేస్తూ ఒక యువతి కనిపించింది. ఆమె రమణయ్య పెద్ద కూతురై ఉంటుందని దివాకరుడు అనుకున్నాడు. రమణయ్య, దివాకరుడికి మర్యాదలు చేసి కుటుంబ సభ్యులను పరిచయం చేస్తూండగా, ఆయన చిన్న కూతురు చింతామణి ఏడుపుముఖంతో అక్కడికి వచ్చింది.

"ఏమిటి చింతామణీ? ఏం జరిగింది?" అని అడిగాడు రమణయ్య ఆందోళనతో.

గుడిసేవ మురళీధర్



''పళ్ళ దుకాణానికి వెళ్ళి వస్తూంటే, ఓబులుగాడు పరాచికాలాడి నడివీధిలో నన్ను పరిహసించాడు,'' అన్నది చింతామణి కళ్ళు తుడుచుకుంటూ.

''వాడొక తుంటరి వెధవ. వాడి నాన్న ఘట్టయ్య పేరుమోసిన గజదొంగ. దుష్టులకు దూరంగా ఉండాలి తల్లీ. అసలు నువ్వు ఒంటరిగా పళ్ళదుకాణానికి ఎందుకు వెళ్ళావు?'' అన్నాడు రమణయ్య బాధగా.

''దీనికిమాటలతో బుద్ధిరాదు. ఒకరోజంతా తిండిలేకుండా గదిలో పెట్టి గొళ్ళెం వేయాలి,'' అన్నాడు పక్కనే ఉన్న అన్న ధనశేఖరుడు చెల్లెలికేసి కోపంగా చూస్తూ.

సానుభూతి కోసం చూస్తున్న చింతామణి, సాధింపులు ఎదురయ్యేసరికి, ఏడుస్తూ తన గదిలోకి వెళ్ళిపోయింది.

''నేను వెళ్ళి వస్తాను, రమణయ్యగారూ,'' అంటూ లేచి నిలబడ్డాడు దివాకరుడు.

''అది మా రెండో అమ్మాయి. ఎప్పుడు, ఎక్కడ, ఎలా మాట్లాడాలో తెలియదు. ఏమీ అనుకోకు. ఇంతకూ మా పెద్దమ్మాయి నీకు నచ్చినట్టేనా?'' అని అడిగాడు రమణయ్య.

''ఏ సంగతీ తరవాత చెబుతాను. దూర ప్రయాణం చేయాలికదా? చీకటి పడుతోంది. ఇక బయలుదేరుతాను,'' అంటూ దివాకరుడు వీధికేసి నడిచాడు.

ఊరి మొదట మర్రిచెట్టు కూడలి వద్ద రాజధానికి వెళ్ళే జోడెడ్ల బండి సిద్ధంగా ఉన్నది. దివాకరుడు బండి ఎక్కాడు. అప్పటికే అందులో ముగ్గురు ప్రయాణీకులు కూర్చుని ఉన్నారు. బండివాడు ఎడ్లను అదిలించాడు. బండి మట్టిదారి మీద వేగంగా వెళుతూంటే, బండి కాడెకు కట్టిన కంచు గంట గణగణమంటూ మోగుతోంది. చీకటి కమ్ముకుంటూండగా బండినొగకు దిగువ వేలాడుతున్న దీపం వెలిగించాడు బండివాడు. అది చూసి ఒక ప్రయాణీకుడు, ''పగలు ప్రయాణం చేయాలంటే పనిఒత్తిడి. రాత్రిళ్ళు ప్రయాణం చేయాలంటే దారిలో దొంగల భయం. ఏం చేస్తాం. తప్పదు మరి,'' అంటూ నిట్టూర్చాడు.

అలా బండిరెండు గంటలు ప్రయాణించి, అడవి దాటే సమయంలో, దారి కడ్డంగా ఒకడు కత్తిపట్టుకుని నిలబడివుండడం చూసిన బండివాడు, ''గజదొంగ ఘట్టయ్య... పారి పొండి... పారి పొండి,'' అంటూ బండిని ఆపాడు.

ఘట్టయ్య పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ బండి దగ్గరికి వచ్చి, ''ఒక్కరూ ఇక్కడి నుంచి పారిపోలేరు. మర్యాదగా మీ దగ్గరున్న డబ్బులు, బంగారం బయటకు తీయండి,'' అన్నాడు భయంకరమైన కంఠస్వరంతో.

బండిలోని ముగ్గురు ప్రయాణీకులు భయపడి వాడు చెప్పినట్టు చేయబోతూండగా, దివాకరుడు ఒక్క చెంగున ముందుకు దూకి, బండివాడి చేతిలోని చెర్నాకోలును లాక్కుని గాలిలో గట్టిగా ఝుళిపిస్తూ, ''ఒరే, ఎంతకాలానికి దొరికావురా ఘట్టయ్యా? నీ దొంగతనాలూ, నీ కొడుకు ఆగడాలూ గురించి విని, నిన్ను పట్టుకోమని రాజుగారు నన్ను పురమాయించాడు. గుట్టుగా లొంగిపోయావో తక్కువ శిక్ష పడుతుంది. పారిపోవాలని ప్రయత్నించావో, అడవిలో మాటువేసి వున్న మాసైనికుల చేతిలో దారుణంగా చస్తావు,'' అని హెచ్చరించాడు.

అడవిలో సైనికులున్నారన్నమాట వినగానే ఘట్టయ్యకు గుండె ఆగినట్టయింది. ఏం చేయడమా అని దిక్కులు చూడసాగాడు. అదే అదునుగా దివాకరుడు వాడి మీదికి సింహపు కొదమలా ఉరికి, చేతిలోని కత్తి దూరంగా పడేలా చేతి మీద గట్టిగా కొట్టాడు. అంతలో ముగ్గురు ప్రయాణీకులూ ముందుకు దూకి వాణ్ణి వడిసి పట్టుకుని, కాళ్ళు చేతులు కట్టి బండిలో కుదేశారు.

మరునాడు రాజు సభలో ఉండగా, ఘట్టయ్యను అక్కడికి లాక్కుపోయి, సంగతి వివరించారు. ఘట్టయ్య తలవంచుకుని నేరాలను అంగీకరించాడు.





అంతా విన్న రాజు, "ఘట్టయ్య చేస్తున్న దారుణాలను గురించి కొంతకాలంగా ప్రజలు మొరపెట్టుకుంటున్నారు. వీడు దొంగతనాలు చేసి అడవిలోకి పారిపోవడం వల్ల ఇన్నాళ్ళు పట్టుకోలేక పోయాం. వీణ్ణి బంధించి తెచ్చిన మా దివాకరుడి ధైర్యసాహసాలను, సమయ స్ఫూర్తిని అభినందిస్తున్నాను. ఇదే విధంగా ఘట్టయ్య కొడుకును కూడా బంధించి తీసుకు రావలసిందిగా దివాకరుణ్ణి ఆదేశిస్తున్నాను," అన్నాడు.

దివాకరుడు కొందరు భటులను వెంట బెట్టుకుని రామవరం వెళ్ళి, ఘట్టయ్య కొడుకు ఓబులును చాకచక్యంగా పట్టి బంధించి తెచ్చి, రాజు ఎదుట హాజరు పర చాడు. తండ్రీ కొడుకులకు కఠిన కారాగారశిక్ష విధించిన రాజు, దివాకరుణ్ణి నగర కాపలా భటుల విభాగంలో ఉన్నత అధికారిగా నియమించాడు.

ఆ సంగతి రమణయ్యకు తెలియడంతో, తన కాబోయే అల్లుడి ధైర్య సాహసాలకు మురిసిపోతూ, అతన్ని చూడడానికి ఉత్సా హంతో రాజధానికి బయలుదేరాడు. అయితే, ఆయన పెళ్ళి ప్రస్తావన తేగానే దివాకరుడు, "క్షమించండి. నేను మీ అమ్మాయిని చేసుకో లేను," అన్నాడు తల అడ్డంగా ఊపుతూ.

"ఎందుకు బాబూ? అమ్మాయి నచ్చ లేదా?" అని అడిగాడు రమణయ్య.

"అమ్మాయి నచ్చక పోవడం వల్ల కాదు," అన్నాడు దివాకరుడు.

"ఉద్యోగం హోదా పెరిగినందువల్ల మరింత పెద్ద సంబంధం చూస్తున్నావా ఏం?" అని అడిగాడు రమణయ్య.

''అదేం కాదు,'' అన్నాడు దివాకరుడు తల అడ్డంగా ఊపుతూ. ''మరెందుకు మా సంబంధం వద్దంటున్నావో తెలుసుకోవచ్చా?'' అని మళ్ళీ అడిగాడు రమణయ్య.

''మీ తండ్రీ కొడుకుల స్వభావం వల్లే! ఆ రోజు నేను మీ ఊరికి మొదట వచ్చినప్పుడు మీ చిన్నమ్మాయిని ఒక తుంటరివెధవ అల్లరి చేశాడని చెబితే, మీ తండ్రీకొడుకుల్లో సరైన ప్రతిస్పందన రాలేదు. తప్పు చేసినవాణ్ణి న్యాయాధికారి దగ్గరికి తీసుకు వెళ్ళకపోగా, ఏమాత్రం తప్పుచేయని మీ అమ్మాయినే తప్పు బట్టారు. ఇది మీ చవటదనాన్ని చాటుతుంది. అటువంటి కుటుంబంతో సంబంధం చేయడానికి నా మనసొప్పడం లేదు,'' అన్నాడు దివాకరుడు కోపంగా.

''బాబూ, నువ్వొక రాజోద్యోగి అయిన యువకుడిగా కాకుండా, మామూలు ఆడపిల్లల తండ్రిగా, అన్నగా ఆలోచిస్తే ఈ సమస్య అర్థమవుతుంది. ఆరోజు మా అమ్మాయిని అల్లరి చేసిన ఓబులు పేరుమోసిన గజదొంగ కొడుకు. ఆ గజదొంగను గురించి మా పట్టణ ప్రజలు రాజుగారికి మొరపెట్టుకున్నా ఫలితం లేని రోజులు అవి. అలాంటప్పుడు మేము వాడి కొడుకు మీద తిరగబడడం వల్ల పర్యవసానాలు ఎలా ఉంటాయో ఆలోచించు. ముల్లు అరిటాకు మీద పడ్డా, అరిటాకు ముల్లు మీద పడ్డా నష్ట పోయేది అరిటాకే. ఆ స్థితిలో మా బిడ్డను అదుపు చేయడం తప్ప మేము చేయగలిగిందేమీ లేదు. అనువుగాని చోట అప్పటి పరిస్థితులను అనుసరించి వెళ్ళడం పిరికితనం కాదు. బాగా ఆలోచించి చూడు. నీ మంచి నిర్ణయాన్ని నిదానంగానే తెలియజెయ్,'' అని చెప్పి రమణయ్య అప్పటికప్పుడే రామవరానికి బయలుదేరి వెళ్ళాడు.

దివాకరుడు రమణయ్య చెప్పిన మాటలు విని నిదానంగా ఆలోచించాడు. వాటిలో వాస్తవం ఉందని గ్రహించాడు. రాజోద్యోగి అయిన తనలో ఉన్న తెగువ, సాహసం సామాన్య పౌరులైన ఆ తండ్రీకొడుకుల్లో లేదని ఆగ్రహించడం సబబు కాదని అర్థం చేసుకున్నాడు. అతడు శాంతామణిని వివాహ మాడడానికి సమ్మతి తెలియజేయడంతో, త్వరలోనే వాళ్ళ వివాహం జరిగిపోయింది.



# అడ్డగాడిద

లోకయ్య ముప్ఫై ఏళ్ళ వయసువాడు. వాడికి నా అన్నవాళ్ళెవరూ లేరు. ఊళ్ళో వాళ్ళు ఎవరేపనిచెప్పినా, ఏమాత్రం విసుక్కోకుండా, వాళ్ళవాళ్ళ పనులు సక్రమంగా చేస్తూండే వాడు. వాడికి ఆకలి బాధా, రాత్రికి ఎక్కడ నిద్రించడమా అన్న సమస్య లేదు. ఆకలిగా వున్నప్పుడు ఎవరింటికి వెళ్ళినా ఇంత అన్నం పెట్టే వాళ్ళు. రాత్రి వేళ ఏ గృహస్థు ఇంటి పంచనో నిద్రపోయేవాడు.

ఒకసారి వాడు, గుడిపూజారి చెప్పిన పని మీద పొరుగు గ్రామంలో ప్రతి శనివారం జరిగే సంతకు వెళ్ళి, కావలసిన వస్తువులు కొని, అక్కడ ఆటగాళ్ళూ పాటగాళ్ళూ ప్రదర్శించే వింతలు చూసి, తిరిగి ఊరుకు బయలుదేరాడు. ఆ సరికి సూర్యుడస్తమించి కనుచీకటిగా వున్నది.

లోకయ్య ఏవో కూనిరాగాలు తీస్తూ, ఊరి చెరువుకట్ట దిగుతూండగా, హఠాత్తుగా ఒకడు ఎదురై, ''ఒరే, ఆరోజు నన్ను చాటు మాటుగా వుండి కొట్టి పారిపోతావా? ఇదుగో, రత్తిగా కాచుకో!'' అంటూ, వాడి మెడ మీద బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు లోకయ్య వెల్లకిలాపడి లేస్తూ, ''ఆహా, ఆహా,'' అంటూ పెద్దగా నవ్వసాగాడు. అది చూసి వాణ్ణి కొట్టినవాడు, ''అలా అడ్డగాడిదలా ఓండ్ర పెడతావెందుకురా, రత్తిగా?'' అంటూ చెయ్యెత్తాడు.

లోకయ్య ఇంకా నవ్వుతూనే, ''ఆ అడ్డగాడిదను నేను కాదు; నా పేరు లోకయ్య!'' అంటూ మరింతగా నవ్వసాగాడు.






# రాకాసిలోయ

## 6

[బ్రహ్మదండి మాంత్రికుడి శిష్యుడైన జయమల్లుతో కలిసి, కేశవుడు ఏనుగుల కొలనుకు స్నానానికి వెళ్ళాడు. కొలనులో స్నానం ముగించి అక్కణ్ణించి తిరిగి వచ్చేప్పుడు, జయమల్లు కేశవుడితో మాంత్రికుణ్ణించి తమకు రానున్న ప్రమాదాన్ని గురించి చెప్పాడు. వాళ్ళిద్దరూ గుహను సమీపిస్తుండగా, మాంత్రికుడు వాళ్ళను ఎండు పుల్లలు తేవలసిందిగా కేకపెట్టాడు. తరవాత-]

బ్రహ్మదండి మాంత్రికుడు తమ కేసి చూస్తూ చిరునవ్వు నవ్వటం, కాలభైరవుడు ఆకలితో నకనకలాడిపోతున్నాడనటం, కేశవుడికి భయం కలిగించింది. ఒకవేళ తనూ, జయమల్లూ మాట్లాడుకున్న మాటలన్నీ, తన మంత్రశక్తి చేత వాడు విన్నాడేమో అనుకున్నాడు కేశవుడు. ఇంక నాలుగైదు గంటల్లోపల తను మరణించటమో లేక బ్రహ్మదండి మాంత్రికుడు చావటమో తేలిపోతుంది.

కేశవుడు ఇలాంటి ఆలోచనలతోనే జయమల్లుతో పాటు చెట్ల కింద పడివున్న ఎండు పుల్లలు ఏరాడు. అవి బాగా పెద్ద మోపుకు సరిపడ అయినతరవాత ఇద్దరూ కలిసి, వాటిని నెత్తిన పెట్టుకుని మాంత్రికుడున్న గుహకేసి బయలుదేరారు. ఒక అరగంట గడిచిన తరవాత వాళ్ళు గుహను సమీపించే సరికి, లోపలి నుంచి బ్రహ్మదండి మాంత్రికుడు పఠిస్తున్న మంత్రాలు బయటికి వినబడుతున్నవి.

కేశవుడూ, జయమల్లూ ఎండు పుల్లల మోపులను గుహముందు నెమ్మదిగా పడవేసి, అడుగులో అడుగు వేసుకుంటూ,




ఏమాత్రం చప్పుడు చెయ్యకుండా గుహలోప లికి వెళ్ళారు.

బ్రహ్మదండి మాంత్రికుడు కాలభైరవుడి విగ్రహం ముందు బాచిపట్టు వేసుక్కూచుని, పెద్దగా మంత్రాలు చదువుతూ, మధ్య మధ్య చేతిలో వున్న చిన్న చిన్న గులక రాళ్ళను విగ్రహం కేసి విసురుతున్నాడు. ఇదేం పూజ చెయ్యటం? అన్నట్టు కేశవుడు జయమల్లు కేసి సౌంజ్ఞ చేశాడు. అతడు పెదాల మీద వేలు వేసుకుని, మాట్లాడకు అన్నట్టు ఉరిమి చూశాడు.

కొండమీది గుహలో మాంత్రికుడు కాల భైరవుణ్ణి గులకరాళ్ళతో పూజించి ప్రసన్నుణ్ణి చేసుకోవాలని ప్రయత్నిస్తుంటే, అక్కడ బ్రహ్మపురంలో ప్రజలూ, రాజుగారూ కూడా, పొరుగు రాజ్యపు సైన్యాలు తమ మీద ఏ క్షణాన వచ్చి పడతవో అని గగ్గోలుపడి పోతున్నారు. రాజుగారూ, మంత్రీ కూడా కొండ మీద శత్రుసైన్యాలేవో చేరినవని నమ్మారు. ఆ నమ్మకం వల్లనే వాళ్ళు కొంత సైన్యాన్ని కొండ మీద ఏమున్నదో చూసేందుకూ, శత్రుసైన్యం వుంటే వాళ్ళను హతమార్చేందుకూ పంపారు. కాని, అనుకోని విధంగా సైన్యాలు కొండ ఎక్కే సమయానికి, కొండ అంతా కంపించి పోయి, పెద్ద పెద్ద రాళ్ళు మీద పడటంతో సైనికులు చాలామంది మరణించారు. చావగా మిగిలిన సైనికులు తిరిగివచ్చి కొండ మీద తాము చూసిన దాన్ని గురించి రకరకాలుగా చెపుతున్నారు.

రాజుగారి రహస్య మందిరంలో ఆయనతో పాటు మంత్రీ, కొత్తగా నియమింపబడిన సేనా నాయకుడూ, రాజగురువూ కూడా వున్నారు. సేనానాయకుడూ, మంత్రీ చెప్పింది విన్న తరవాత రాజు తన గురువు కేసి తిరిగి, ''గురువర్యా, అంతా విన్నారు గదా? సైనికులు చెప్పేదాంట్లో మనం ఏది నమ్మాలి? ఆ కొండ మీద వందలసంఖ్యలో శత్రుసైనికులున్నా రన్న మాట నమ్మాలా? లేక శరీరం అంతా నెత్తురు పూసుకుని, నిప్పులు చెరిగే కళ్ళతో, నెత్తిన పెద్ద శిఖతో భయంకరంగా వున్న మాంత్రి కుడున్నాడన్న మాట నమ్మాలా? నాకేమీ పాలుపోవటం లేదు,'' అన్నాడు.

రాజగురువు ఓ క్షణకాలం ఆలోచించి తృప్తిగా తలాడిస్తూ, ''ఈ రెండు మాటలూ నిజమే అని మనం ఎందుకు నమ్మగూడదు?'' అని అడిగాడు.

''మాంత్రికుడికీ, శత్రుసైనికులకూ పొత్తెలా కుదురుతుంది? ఆ మాంత్రికుడు

కూడా శత్రురాజుకు సహాయం చేయవచ్చిన వాడని మీ అభిప్రాయమా?'' అన్నాడు రాజు అనుమానంగా.

''ఆ సంగతి మాత్రం నేను ఇదమిత్థమని తేల్చి చెప్పలేను. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆ కొండ దగ్గిరకు వెళ్ళిన మన సైనికులందరికీ మతులు పోయినై. వందల సంఖ్యలో శత్రు సైనికుల్ని చూసినవాళ్ళ మాట అటుంచి, అక్కడున్న మాంత్రికుడే కొండలో భూకంపం పుట్టించాడని కూడా కొందరు నమ్ముతున్నారు. పైగా, ఆ వింత జంతువు ఒకటి!'' అంటూ రాజగురువు చిరునవ్వు నవ్వాడు.

''అలాంటి జంతువు వుండే అవకాశమే లేదంటారా? నేనూ మొదట నమ్మలేదు. కాని, ఆ మాంత్రికుణ్ణి గురించి విన్న తర వాత....'' అంటూ మంత్రి నీళ్ళునమిలాడు.

''మంత్రీ, నేనూ కొద్దో గొప్పో మంత్ర శాస్త్రం చదివినవాణ్ణే!'' అంటూ రాజగురువు చిరుకోపంగా మంత్రికేసి చూశాడు.

''గురువర్యా, అందుకే గదా మిమ్మల్ని ఇక్కడికి రావలసిందిగా కోరింది. మీ సహాయం లేకుండా మేము చేయగలిగిందేమీ లేదు,'' అన్నాడు రాజుగారు బతిమాలుతున్నట్టు.

''సరే, కేవలం ఊహించిన వాటి సాయంతో మనం ఏం నిర్ణయాలు చేయగలం? తమ అంగరక్షకుడి నాయకత్వాన కొండ దగ్గిరకు వెళ్ళిన సైనికుల్ని తిరిగి రానివ్వండి,'' అంటూ రాజగురువు లేచి గది బయిటికి వచ్చాడు.

రాజుగారు పంపగా, కొండమీద ఎవరు న్నారో, అక్కడి పరిస్థితులెలా వున్నవో చూసి



వచ్చేందుకు బయలుదేరిన ఆయన అంగ రక్షకుడు, వెంట వున్న ఇద్దరు సైనికులతో కొండ దాపున గల అడవిలోకి చేరాడు. అల్లంత దూరాన భూకంపానికి ఎగుడు దిగు డుగా, ఒక రాయి మీద ఇంకో రాయి పడి వింత వింత ఆకారాలు దాల్చి వున్న కొండను చూస్తూనే వాడి గుండెలు పీచుపీచు మన్నాయి. ఇక, వాడి వెంట వున్న ఇద్దరు సైనికుల భయాన్ని గురించి వేరుగా చెప్ప వలిసిందే లేదు.

''మీలో ఎవరైనా లోగడ ఈ కొండ ఎక్కారా? దారి మార్గాలు తెలిసిన వాడు ఒక్కడుంటే ఎంత బావుండును!'' అన్నాడు రాజుగారి అంగరక్షకుడు.

అతడి వెంట వున్న సైనికుల్లో ఒకడు పూర్వం ఆ కొండ ఎక్కినవాడే. కాని, శత్రుసైని కుల్ని గురించిన కథలూ, వింత జంతువూ,




మాంత్రికుడూ-ఇవన్నీ జ్ఞాపకం వచ్చి, వాడికి శరీరం జలదరిస్తున్నది.

''అయ్యా, మనం కొండెక్కి చూసే దేముంటుంది? ఒకవేళ అక్కడ శత్రు సైనికులు గాని, మాంత్రికుడు గాని వుంటే, మనం ప్రాణాలతో అక్కడి సంగతులు రాజుగారికి చెప్పేందుకు బతికివుండం. ఒకవేళ అలాంటి వాళ్ళెవరూ అక్కడ లేకపోతే, మనం పని కట్టుకుని అంత ఎత్తు ఆ కొండ ఎక్కటం వృథా,'' అన్నాడా సైనికుడు.

అంగరక్షకుడికి ఈ మాటలు బాగానే వున్నట్టు తోచినై. తను తిరిగి వెళ్ళి రాజుగారితో కొండమీద, ఎవరూ లేరని చెబితే సరిపోతుంది. కాని, తనవెంట వున్న సైనికులు రాజుగారి నుంచి మెప్పు పొందేందుకు, తను కొండే ఎక్కలేదని ఆయనతో చెప్పేస్తే, తనకు ప్రాణాపాయం తప్పదు!

''ఉహుం, అదేం లాభం లేదు. మనం కొండ ఎక్కి అక్కడెవరున్నారో చూడవలసిందే. శత్రువుల చేతిలో చచ్చామా, వీరస్వర్గం. బతికి బయటపడ్డామా, రాజుగారి నుంచి గొప్ప బహుమానాలు పొందవచ్చు. అయినా ... ఎవడైనా ఒక్కడు దారి చూపేవాడుంటే బావుండునే...'' అంటూ అంగరక్షకుడు తల గోక్కొంటూ కొండకేసి చూడసాగాడు.

అంగరక్షకుడూ, సైనికులూ, ఏ చెట్టు కింద అయితే నిలబడి వున్నారో, ఆ చెట్టు మీదే కేశవుడి ముసలి తండ్రి కూచుని వున్నాడు. అతడు, తన కొడుకు వింత జంతువు నెక్కి కొండ మీదికి పారిపోయినప్పటి నుంచీ, అక్కడ జరుగుతున్న సంగతులేవో చాలా వరకు చూశాడు. మాంత్రికుడు గుహలో నుంచి బయటికి రావటం, తన కొడుకూ, అదే వయసువాడైన మరి ఒకడూ కలిసి మాట్లాడుకుంటూ వుండటం-బ్రహ్మపుర సైనికుల దాడీ, కొండలో పుట్టిన భూకంపం-సర్వం అతడు చూశాడు.

తన కొడుకు ఎవడో మాంత్రికుడికి చిక్కిపోయాడన్న నమ్మకం ఆ ముసలివాడికి కలిగింది. తను ఒంటరిగా వెళ్ళి అతణ్ణి రక్షించటం ఎలాగా అని అతడు ఆలోచిస్తున్నాడు. ఇప్పుడు ఈ సైనికులు చెట్టు కిందికి వచ్చి, ఆ కొండ ఎక్కాలని మాట్లాడుకుంటూ వుండటం, దారి చూపేవాడు వుంటే బావుంటుందని చెప్పుకోవటం, ముసలివాడికి ధైర్యం కలిగించింది.

ముసలివాడు పిల్లిలా చెట్టు కొమ్మల్లోంచి మెల్లిగా కిందికి దిగి, ఆ పక్కనే వున్న మరో

చెట్టు కిందికి వెళ్ళి వెల్లకిలా పడుకుని, కళ్ళు మూసుకుని, నిద్రలో ఏదో కలవరిస్తున్న వాడిలా శబ్దం చేశాడు. ఆ శబ్దం వింటూనే రాజుగారి అంగరక్షకుడికీ, సైనికులకూ పై ప్రాణాలు పైనే పోయినై. ముగ్గురూ ఒక్కసారి ఎగిరి గంతేసి, ఆ ధ్వని వచ్చిన వైపుకు చూశారు. వాళ్ళకు చెట్టు కింద ముసలివాడు కనిపించాడు.

''వీడే మాంత్రికుడై వుంటాడు! ఆ పొడ వాటి గడ్డం చూశావా? వాడు నిద్రలో వున్న ట్టుంది, గొంతు కోసేస్తే పీడ విరగడవుతుంది,'' అన్నాడొక సైనికుడు.

ఈ మాటలు వింటూనే, తనకు అనుకోని ప్రమాదం ఏదో కలగనున్నదని గ్రహించిన ముసలివాడు, ఆవలిస్తూ లేచికూచున్నాడు. ముసలివాడి వాలకం చూసి, వాడు మాంత్రికుడై వుండడని ఊహించిన అంగరక్షకుడు, చప్పున ఒరలో నుంచి కత్తి దూసి, అట్టహాసం చేస్తూ అతడి దగ్గిరకు వెళ్ళి, ''ఎవర్రా నువ్వు? ఈ కొండ దగ్గిర అడవిలో నీకేం పని?'' అని పళ్ళు కొరుకుతూ ప్రశ్నించాడు.

ముసలివాడు జవాబు చెప్ప బోయేంతలో సైనికుల్లో ఒకడు, ''నువ్వు మాంత్రికుడివా?'' అని అడిగాడు. రెండోవాడు, ''నువ్వు శత్రు దేశపు సైనికుడివా?'' అని రెట్టించాడు.

''అయ్యా, నేను మీరనుకునే వాణ్ణెవర్నీ కాదు. ఈ అడివిలో కందమూలాలూ, ఆకులూ అలములూ తిని బతికే ఒక ముసలివగ్గును. నన్ను చూసి మీరు శత్రుసైనికుడనుకోవటం వింతగావున్నది,'' అన్నాడు ముసలాడు.



''అలాగా, అయితే నీ ప్రాణానికి అపాయం కలగదని నేను అభయం ఇస్తున్నాను. నేను స్వయం బ్రహ్మపుర రాజుగారి అంగరక్షకుణ్ణి! ఈ కొండమీద రాజద్రోహులెవరైనా వున్నారేమో; వుంటే హతమార్చాలని వచ్చాను. నీకు కొండమీది దారి తెరువు లేమైనా తెలుసా?'' అని అంగరక్షకుడడిగాడు.

ముసలివాడు తన అరచేతిని, వెడల్పుగా చాచి, ''ఇక్కడున్న గజిబిజి రేఖలూ, గుంటలూ, సొట్టలూ ఎంత బాగా తెలుసో, కొండమీది దారులూ నా కుతబాగా తెలుసు,'' అన్నాడు.

''ఆహా, అవసరానికి భలే వాడివి కన బడ్డావ్. అయితే, ముందుండి కొండమీదికి దారి తియ్యి. ఇవ్వాళో రేపో కాటికి ప్రయాణం కట్టే వాడివిలా వున్నావుగాని, లేకపోతే రాజు గారికి చెప్పి, నీ కెన్ని బహుమానాలైనా ఇప్పించే వాడిని,'' అన్నాడు అంగరక్షకుడు ఆనందంగా.

ముసలివాడికి అంగరక్షకుడనే మాటలు చెవికెక్కటం లేదు. ఈ బ్రహ్మపుర సైనికుల సాయంతో తన కొడుకు కేశవుణ్ణి, మాంత్రికుడి బారి నుంచి రక్షించుకోవాలన్నదే అతడి ఆరాటం. అతడు కొండకేసి నడవసాగాడు. కొంచెందూరం అతణ్ణి అనుసరించి పోయిం తరవాత, అంగరక్షకుడికి ముసలివాడి చేతిలో వున్న కత్తి కనబడింది. వాడు ఆశ్చర్యపోతూ, ''అడవిలో కంద మూలాలు తిని బతికే నీకు ఈ కత్తి ఎందుకు?'' అని అడిగాడు.

''నేనూ, ఒకప్పుడు బ్రహ్మపుర రాజుగారి దగ్గిర సైనికుడుగా వున్నాను – ఈ రాజుగారు కాదు, ఈయన తండ్రిగారి కాలంలో. అప్పటి నుంచీ ఈ కత్తి నా వెంటనే వుంటున్నది,'' అన్నాడు ముసలివాడు విసుగ్గా.

ఆ మాటలు వింటూనే సైనికులు గుస గుస లాడారు. అంగరక్షకుడు వాళ్ళకేసి ఉరిమి చూస్తూ, ''మన ప్రాణాల కొచ్చిన భయం ఏమీ లేదు. వాణ్ణి నమ్మలేకే ముందు దారి తియ్యమన్నాను. ఏదైనా మోసం జరిగేలా వుందో, వెనక నుంచి వాడి మెడ నరికేద్దాం,'' అన్నాడు మెల్లిగా.

ముసలివాడికి ఈ మాటలు వినిపించినా, వినిపించనట్టే నటిస్తూ కొండ ఎక్కటం ప్రారంభించాడు. – (ఇంకావుంది)






బేతాళ కథలు

# నాస్తికుడి దైవప్రార్థన

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, భీతిగొల్పే ఈ శ్మశానంలో ఇంత రాత్రి వేళ కష్టాలకోర్చి నువ్వు చేస్తున్న శ్రమ చూస్తూంటే ఆశ్చర్యం కలుగుతున్నది. లోకంలో కొందరు ఆస్తికులు ధనాన్ని దానధర్మాలకు వినియోగిస్తూ, క్రమంగా పేదలైపోవడం తెలిసిందే. అలాగే నాస్తికులు దానధర్మాల గురించిన ఆలోచన లేకుండా కోట్లకు పడగలెత్తి సర్వసుఖాలూ అనుభవిస్తూంటారు. ఈ ఇరువురిలో నువ్వు ఏ కోవకు చెందినవాడివై వుంటావో తెలి




యడం లేదు. తండ్రీ కొడుకులైన ఒక ఆస్తిక–నాస్తికుల కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

భాగ్యపురంలో వుండే ధనపాలుడికి వారసత్వంగా వచ్చిన ఆస్తితో పాటు, దయాగుణాలూ, దైవభక్తీ కూడా ఎక్కువే. ఆయన భార్య సురుచికీ దైవభక్తి వున్నా భర్త డబ్బంతా దైవకార్యాలకూ, దానధర్మాలకూ ఖర్చు చేయడాన్ని ఆమోదించలేకపోయేది. పెద్దలిచ్చిన ఆస్తిని కొడుకులకు మిగల్చాలని భర్తకు నచ్చజెప్ప ప్రయత్నించేది. ఆమె ఎంత చెప్పినా ధనపాలుడు తన పద్ధతి మార్చుకోలేదు.

ఆ దంపతులకు శ్రీపాలుడు, గోపాలుడు, గుణపాలుడు అనే ముగ్గురు కొడుకులున్నారు. చిన్నవాళ్ళిద్దరికీ తండ్రి మాటే వేదం. పెద్దవాడు శ్రీపాలుడికి మాత్రం తల్లి మాటలు బాగా చెవికెక్కాయి. ఆస్తిని కాపాడుకునేందుకు అతడు చిన్నప్పట్నించే నాస్తికుడు, పిసినారి అయ్యాడు.

ఇది గమనిస్తున్న ధనపాలుడు, భార్యతో, ''డబ్బు శాశ్వతమూ కాదు, సంతోషాన్నీ ఇవ్వదు. మనిషికి సంతోషాన్నిచ్చేది సంతృప్తి మాత్రమే! దైవభక్తి, దయాగుణం లేనివాడికి సంతృప్తి వుండదు,'' అనేవాడు.

అందుకామె ఒప్పుకోక, ''ఉన్నప్పుడు డబ్బు విలువ తెలియదు. డబ్బు లేనప్పుడు మంచితనం మనకు గంజినీళ్ళు కూడా పొయ్యదు,'' అనేది.

కొడుకులు ఎదిగొచ్చే సరికి ధనపాలుడి దగ్గిరున్న డబ్బంతా ఖర్చయిపోయి, ఇరవై ఎకరాల పొలం మాత్రం మిగిలింది. తన ఖర్చులకు పొలం మీదొచ్చే ఆదాయం చాలక కొంత భూమిని అమ్మాలనుకున్నాడాయన. అప్పుడు సురుచి ఆయనతో, ''పిల్లలు పెద్దవాళ్ళయ్యారు. ఆస్తిలో వాళ్ళ వాటా వాళ్ళకిచ్చి, నీ వాటా నీ ఇష్టమొచ్చినట్లు ఖర్చు చేసుకో,'' అన్నది.

ధనపాలుడు సరేనని ఆస్తిని తనకూ, కొడుకులకూ కలిపి నాలుగు వాటాలు వేసి, ''ఇప్పుడు మనందరికీ తలో ఐదెకరాల పొలమున్నది. డబ్బు ఖర్చు విషయంలో నా పద్ధతినచ్చినవాళ్ళు నాతో వుండొచ్చు; లేనివాళ్ళు వేరు పడొచ్చు,'' అన్నాడు.

చిన్న కొడుకులిద్దరూ తండ్రితోనే వుంటామన్నారు. కానీ శ్రీపాలుడు వేరుపడివెళ్ళిపోయి వ్యవసాయాన్ని మాత్రమే నమ్ముకోక, ఊళ్ళో చిన్న వ్యాపారం ప్రారంభిస్తే బాగా కలిసొచ్చింది. రెండేళ్ళలోనే అతడు కోటికి

పడగెత్తాడు. డబ్బు చేరగానే, కొందరు మిత్రులు శ్రీపాలుడి వద్దకు వెళ్ళి, ధన సహాయం కోరారు. అతడు ఒక్కరికి కూడా సాయపడకపోతే, ఉక్రోషపడి పిసినారివనీ, నాస్తికుడివనీ తిట్టారు.

కొంతకాలం గడిచే సరికి ధనపాలుడు ఉన్న పొలమంతా అమ్మేశాడు. తిండి గింజలకు కూడా కరువై సాటివారిని అప్పడిగితే ఒక్కరూ సాయపడలేదు. అప్పుడు, ధనపాలుడికి అర్థమైంది; దానం చేసేటప్పుడు తనను మాలిన ధర్మం కూడదని! చేసేది లేక ఆయన సకుటుంబంగా పెద్ద కొడుకు వద్దకు వెళ్ళి, ''నీకున్న ముందుచూపు నాకు లేకపోయింది. నాకు కొంత డబ్బు అప్పుగా ఇవ్వు. నేనూ, నీ తమ్ముళ్ళూ ఏదైనా వ్యాపారం ప్రారంభించి డబ్బు సంపాదించి పొట్టపోసుకుంటాం. నీ బాకీ కూడా తీర్చేస్తాం,'' అన్నాడు.

దానికి శ్రీపాలుడు, ''డబ్బు లేక ఇలా అంటున్నావుకానీ, చేతిలో నాలుగు కాసులు ఆడితే, నీ పద్ధతి మొదటికొస్తుంది. అందుకని మీరంతా వచ్చి నాతోవుంటే, మీకు కూడూ గుడ్డలకు లోటురానివ్వను. ఎటొచ్చీ ఇక్కడున్నంత కాలం మీరెవ్వరూ దేవుణ్ణి ప్రార్థించ కూడదు. దానధర్మాలు చేయకూడదు,'' అన్నాడు.

ఆ మాటలకు ధనపాలుడు శాంతంగా, ''నేను బ్రతికున్నంత కాలం దైవప్రార్థన మాత్రం మానలేను,'' అని మిగిలిన వాళ్ళతో వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

పెద్ద కొడుకు నాస్తికుడైనా తనంటే గౌరవమున్నదని సరిపెట్టుకునే వాడు, ధనపాలుడు.



ఇప్పుడు తనే నోరు విడిచి ధనసాయమడిగితే, శ్రీపాలుడు కాదనడాన్ని ఆయన భరించలేక మనసుపాడై మంచాన పడ్డాడు. చిన్నవాళ్ళిద్దరూ కాయకష్టం చేసి డబ్బు సంపాదించేవారు. సురుచి ఇంటిపట్టునే వుండి భర్తకు సేవలు చేస్తూ అందరికీ వండి పెట్టేది. సరైన వైద్యం జరక్క ధనపాలుడి పరిస్థితి నానాటికీ తీసికట్టయింది.

ఇలాంటి పరిస్థితుల్లో, ఆ ఊరుకు అంగదుడనే రామభక్తుడు వచ్చి, రాముడి గొప్పతనాన్ని గురించి ప్రచారం చేయసాగాడు. ఆయన అడుగు పెట్టిన ఇంట శుభం జరిగేది. అందరూ ఆయనకు మహిమలున్నాయని చెప్పుకోసాగారు.

ఇది తెలిసిన గోపాలుడు, గుణపాలుడు, అంగదుణ్ణి తమ ఇంటికి పిలిచారు. అక్కడ ఆయన మంచం పట్టిన ధనపాలుణ్ణి చూసి



''రాముణ్ణి నొప్పించావు. అందుకే నీకీ దుర వస్థ,'' అన్నాడు.

ధనపాలుడు ఆయన వంక దీనంగా చూసి, ''నా పెద్దకొడుకు నాస్తికుడు. తండ్రిని కాబట్టి వాడి తప్పుకు నాదే బాధ్యత. పరిహా రంగా నేనేం చేయాలో తమరే చెప్పండి,'' అని వేడుకున్నాడు.

''రాముడు, తనను నమ్మినవారికి ఏ కష్టాలూ రానివ్వని దేవుడు. అది తెలుసుకోక నీ బిడ్డలకు చెందాల్సిన ఆస్తిని వాళ్ళకు దక్కనివ్వకుండా ఖర్చు చేశావు. మరాయన నొచ్చుకోడా? నీవు ఆస్తిని పాడు చేస్తున్నావనే, నీ పెద్దకొడుకు నాస్తికుడు, పిసినారి అయ్యాడు. అర్థం చేసుకో,'' అన్నాడు అంగదుడు.

అప్పుడు గుణపాలుడు, ''అయ్యా! మా నాన్న మా డబ్బు ఖర్చు చేసినా, అది పుణ్య కార్యాలకే వినియోగించాడు. ఐనా మాకు పాపం చుట్టుకుని కష్టాలనుభవిస్తున్నాం. మా అన్న నాస్తికుడైనా కోటికి పడగలెత్తాడు. ఇదే నా దేవుడి న్యాయం?'' అన్నాడు బాధగా.

అంగదుడు, గోపాలుడి భుజం తట్టి, ''మీ అన్న దేవుణ్ణి నమ్మలేదు తప్ప, దైవ దూషణ చేయలేదు. పిసినారి కాబట్టి అపాత్ర దానాలూ చేయలేదు. అందువల్ల మీ అందరి పుణ్యం అతడికి దక్కి వృద్ధిలో కొచ్చాడు. మీరు కూడా స్వయం కృషిని నమ్ముకుంటే రాముడు హర్షిస్తాడు. మీకు మేలు జరుగు తుంది,'' అన్నాడు అనునయంగా.

ఇది విన్న సురుచి, ఆయనతో, ''ఇక మీదట తమరు చెప్పినట్లే చేస్తాం. ముందు నా భర్తకు జబ్బు తగ్గి మామూలు మనిషి అయ్యే ఉపాయం చెప్పండి,'' అని అడిగింది.

''నీ భర్త ఆరోగ్యవంతుడు కావాలంటే వజ్రభస్మం సేవించాలి. అది తయారు చేయ డానికి లక్ష రూపాయల విలువ చేసే వజ్రం కావాలి,'' అన్నాడు అంగదుడు.

ఇందుకు సురుచి, గోపాలుడు, గుణపా లుడు లక్షరూపాయలు తమకెక్కడి నుంచి వస్తాయని దిగులు పడ్డారు. అప్పుడు అంగ దుడు, ''డబ్బు లేకపోతే మరో ఉపాయం వుంది. ఒక్కరంటే ఒక్కరు మనస్ఫూర్తిగా దేవుణ్ణి నమ్మి ఒక రాత్రంతా ధనపాలుడి ఆరోగ్యం కోసం రామాలయంలో ప్రార్థన చేస్తే, వెంటనే ఆయన మామూలు మనిషవుతాడు. అది మీరైనా కావచ్చు, ఈ ఊళ్ళో మరెవరైనా కావచ్చు,'' అని చెప్పాడు.

సరేనని ఆ రాత్రి గోపాలుడు, గుణపా లుడు రామాలయానికివెళ్ళి, తండ్రి ఆరోగ్యం

గురించి దైవ ప్రార్థనలు చేశారు. ఫలితం కన బడలేదు. మర్నాడు సురుచి వెళ్ళి ప్రార్థనలు చేసింది. ఫలితం లేదు. ఊళ్ళో చాలా మంది ఆలయానికి వెళ్ళి ప్రార్థనలు చేశారు. ధన పాలుడి అనారోగ్యం ఏమాత్రం తగ్గలేదు.

అలాంటి సమయంలో శ్రీపాలుడు, అంగ దుణ్ణి కలుసుకుని, "నా తండ్రి అంటే నాకెంతో గౌరవం. మీకు లక్షరూపాయలిస్తాను. వజ్రభస్మం తయారుచేసి ఆయన్ను ఆరోగ్య వంతుణ్ణి చేయండి," అని కోరాడు.

అంగదుడు నవ్వి, "నీవు పిసినారివి. మన స్ఫూర్తిగా డబ్బిస్తే తప్ప, నా వజ్రభస్మం పని చేయదు. అందుకని నువ్వీ రాత్రి రామాల యంలో, దేవుడిపై పూర్తి నమ్మకం వుంచి ప్రార్థన చేయి. నీ తండ్రి మామూలు మనిషి అయ్యే అవకాశం వుంది," అని చెప్పాడు.

ఇందుకు శ్రీపాలుడు సరేనన్నాడు. ఐతే ఊరి వాళ్ళు మాత్రం, ఎంతో కాలంగా నాస్తికు డుగావున్న శ్రీపాలుణ్ణి ఆలయంలోకి రానివ్వ మని, రాత్రి కాగానే గుడితలుపులకు తాళం పెట్టేశారు.

శ్రీపాలుడు ఆలయ ద్వారం ముందు నిలబడి, "రామా! నీవు తండ్రి మాటమీద రాజ్యం వదిలి అడవులకు వెళ్ళావంటారు. అదే నిజమైతే, తండ్రి ఆరోగ్యం కోసం ప్రార్థించనున్న నాకు, నీవే ఆలయ ప్రవేశం కల్పించు," అన్నాడు.

ఆ మరుక్షణం తలుపులకు తాళాలు విడివడి వాటంతటవే తెరుచుకున్నాయి. శ్రీపాలుడు ఆలయం లోపలికి వెళ్ళి రాముడి విగ్రహం ముందు నిలబడి ప్రార్థన మొదలు పెట్టాడు. ఆ విధంగా తెలతెలవారే వరకూ



ప్రార్థన చేసి, అతడు ఆలయం నుంచి బయటకు వచ్చాడు.

అంతకు చాలా ముందుగానే ధనపాలుడి జబ్బు చేత్తో తీసేసినట్టు మాయమవటంతో, అతడు ఎక్కడలేని సంతోషంతో సకుటుంబంగా ఆలయానికి వచ్చి, శ్రీపాలుణ్ణి ఆప్యాయంగా కావిలించుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, పరమ భక్తుడైన ధనపాలుడు ఉన్న ఆస్తిని పోగొట్టుకుని చితికి పోవడమూ, నాస్తికుడైన శ్రీపాలుడు కోటికి పడగలెత్తడమూ ఆశ్చర్యంగా లేదా? ధనపాలుడి భార్యా, ఇద్దరు కొడుకులూ దైవప్రార్థన చేసినా అతడి జబ్బు నయం కాలేదు. ఊళ్ళోవున్న ఎందరో భక్తుల ప్రార్థనా ఫలించలేదు. ఒక నాస్తికుడి దైవ ప్రార్థన సత్ఫలితాన్నివ్వడం విడ్డూరంగా లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''దైవభక్తికీ, ఆర్థిక పరమైన స్థితిగతులకూ అంతగా సంబంధం కనిపించదు. అందుకే దీనికంతటికీ పూర్వజన్మ కర్మను కారణంగా మన శాస్త్రాలు పేర్కొంటున్నాయి. ఇక, ధనపాలుడి భార్య, చిన్న కొడుకులు ఆయన కోసం ప్రార్థనలు చేసినా, వారికి తాము పడుతున్న కష్టాల కారణంగా దేవుడిపై నమ్మకం పోయింది. అందువల్లనే వాళ్ళ ప్రార్థనలు ఫలించలేదు. ధనపాలుడు ఊళ్ళో ఎందరికో ధనసాయం చేశాడు. కానీ ఒకరూ ఆయన్ను కష్టాల్లో ఆదుకో లేదు. ఆ కారణంవల్లే, వాళ్ళ ప్రార్థనలూ ఫలితాన్నివ్వలేదు. ఇక శ్రీపాలుడి విషయం తీసుకుంటే; తండ్రి పద్ధతి చూసి దైవభక్తివల్ల డబ్బు ఖర్చవుతుందని భయపడి అతడు నాస్తికుడయ్యాడు. అతడికి తండ్రి అంటే ప్రేమవున్నది. అందువల్లే వజ్రభస్మానికి లక్ష రూపాయలివ్వడానికి సిద్ధపడ్డాడు. చిత్తశుద్ధితో సత్కార్యానికి పూనుకునే వారి ప్రార్థనను దేవుడు మన్నిస్తాడు. శ్రీపాలుడి విషయంలో అదే జరిగింది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : ''వసుంధర'' రచన]



# మహా మస్తకాభిషేక మహోత్సవం

కర్ణాటక రాష్ట్రం హసన్ జిల్లా శ్రావణ బెళగొళలోని గోమటేశ్వర శ్రీ బాహుబలి విగ్రహానికి ఫిబ్రవరి రెండవ వారంలో 86వ మహా మస్తకాభిషేక మహోత్సవం జరగనున్నది. జైనులు చాలా ముఖ్యంగా భావించే పన్నెండేళ్ళ కోసారి జరిగే ఈ మహోత్సవం ఈయేడు ఫిబ్రవరి 8 నుంచి 19వరకు జరగనున్నది. 57 అడుగుల (17.5మీ.) ఏకకాండపు శిలా విగ్రహం వెలుగొందు తూన్న ఈ పవిత్ర పట్టణానికి ఈ సందర్భంగా ప్రపంచం మొత్తం నుంచి 30,00,000 మంది భక్తులు రాగలరని ఓ అంచనా.

24మంది తీర్థంకరులలో ఆఖరివాడైన వర్ధమాన మహావీరుడు జైన మతాన్ని స్థాపించాడు. ప్రథమ తీర్థంకరుడైన ఆదినాథ ఋషభదేవుడు రాజు. ఆయన సన్యసించాలనుకుని రాజ్యంలో సగభాగాన్ని పెద్ద కుమారుడు భరతుడికీ, మిగిలిన సగభాగాన్ని చిన్న కుమారుడు బాహుబలికీ పంచి ఇచ్చాడు. అయితే బాహుబలి తనను చక్రవర్తిగా ప్రకటించుకుని అన్నకు ఎదురు తిరిగాడు. మంత్రులు వారిస్తున్నా అన్నదమ్ములు ద్వంద్వ యుద్ధానికి దిగారు. బాహుబలి జయించినప్పటికీ, తన రాజ్యాన్ని కూడా అన్నకు ఇచ్చేసి, తపస్సు చేసుకోడానికి వెళ్ళిపోయాడు. అన్న పానాలు ముట్టకుండా సంవత్సరకాలం తపస్సు చేసి మోక్షం పొందాడు.

చాలా సంవత్సరాలు గడిచిపోయాయి. క్రీ.శ. 10వ శతాబ్దంలో గాంగ వంశానికి చెందిన రెండవ రాచమల్లు రాజువద్ద చాముండ రాయలు ప్రధానమంత్రిగా ఉండేవాడు. ఆయన ఒకనాడు తన తల్లిని బాహుబలి పాలించిన పౌదాన్‌పురకు తీసుకువెళ్ళాడు. అక్కడ తల్లీ కొడుకుల కలలో కుష్మందినీ దేవి కనిపించి, చంద్రగిరి కొండపై నుంచి ఇంద్రగిరి మీదికి బాణం వదలమని చాముండ రాయలును ఆదేశించింది. అదే విధంగా ఆయన ఇంద్రగిరి మీదికి బంగారు బాణం వది లాడు. అక్కడ కొండ మీద బాహుబలి రూప సందర్శనం కలిగింది. ఆ కొండ మీద పెద్ద బండ నుంచి బాహుబలి విగ్రహాన్ని మలిచి ప్రతిష్ఠించాలని చాముండరాయలు నిర్ణయించి, నేర్పరులైన శిల్పులను రప్పించాడు. నిర్ణీత సమయా నికి శిల్పం తయారయింది. 981వ సం. మార్చ్ 13వ తేదీ చాముండ రాయలు ప్రథమ మహామస్తకాభిషేకం నిర్వహిం చాడు. బాహుబలికి గోమటుడు (సుందర రూపుడు) అనే పేరు ఉంది. అదే క్రమేణా గోమటేశ్వర స్వామి అయింది.



భారతదేశంలోని వివిధ నదీ జలాలు, కొబ్బరి నీళ్ళు, చెరకు రసం, తేనె, పాలు, పసుపు, చందనం, పుష్పాలు, అమూల్యమైన మణులు, మాణిక్యాలతో మహా మస్తకాభిషేకం చేస్తారు.

మహారాష్ట్ర జానపద కథ

# కొలనులో అద్భుతం!



ఒకానొకప్పుడు గొప్ప శివభక్తుడైన విజయాదిత్యుడనే రాజు చలవరాళ్ళతో అందమైన శివాలయం నిర్మించాడు. గుడిలోని శివలింగానికి రకరకాలుగా పూజలు జరిపి, శివుడి కరుణ పొందాలని నిరంతరం తపిస్తూ ఉండేవాడు.

ఒకనాడాయన, ''శ్రావణమాసం ఆరంభమయింది. శ్రావణ సోమవారం శివుడికి చాలా ప్రీతిపాత్రమైన శుభదినం. ఆ రోజు శివుడికి ప్రత్యేకమైన పూజలు నిర్వర్తిస్తే బావుంటుంది కదా?'' అని తీవ్రంగా ఆలోచించసాగాడు.

శివుడు అభిషేక ప్రియుడు కదా. అందువల్ల ప్రతి సోమవారం శివలింగాన్ని వెయ్యిన్ని ఎనిమిది కలశాల పాలతో అభిషేకించడం శ్రేయస్కరం. అందుకు అవసరమయ్యే పాలను ప్రజల నుంచే సేకరించాలి. అప్పుడే అభిషేక పుణ్యం ప్రజలందరికీ దక్కుతుంది, అని భావించి పాలను సేకరించడానికి, వెనువెంటనే ఆలయ ప్రాగణంలోనే ఒక కొలను తవ్వించాడు.

కొన్ని రోజుల తరవాత నగరంలో, ''నగర ప్రజలందరూ వినండహో... రేపే మొదటి శ్రావణ సోమవారం. దానిని ఉద్దేశించి మన రాజుగారు వెయ్యిన్ని ఎనిమిది బిందెల పాలతో శివుడికి అభిషేకం చేయనున్నారు. దీని కోసం ప్రతి గృహస్థు, రేపు తెల్లవారగానే, తమ ఇంట్లో ఉన్న పాలను తీసుకువెళ్ళి, శివాలయ ప్రాంగణంలో అందుకని ప్రత్యేకంగా తవ్వబడి ఉన్న కొలనులో పోయాలి. గుర్తుంచుకోండి: మీ ఇళ్ళల్లో ఉన్న పాలన్నింటినీ కొలనులో పోయాలి. చుక్క కూడా మిగుల్చుకోకూడదు. అప్పుడే కొలను త్వరగా నిండగలదు. ఇదే శివుడికి సంతోషం కలిగిస్తుంది. మీ అందరినీ కృపతో చూసి రక్షిస్తాడు!'' అని చాటింపు చేశారు.

నగర ప్రజలందరూ ఆ చాటింపు విన్నారు. రాజుగారి శివభక్తిని తలుచుకుని కొందరు సంతోషించారు. తమ దగ్గరున్న పాలన్నిటినీ శివపూజకని కొలనులో పోసేస్తే ఎలా అని పలువురు అనుకున్నారు. అయినా, రాజాజ్ఞ గనక ఎవరూ ఏమీ మాట్లాడలేకపోయారు.

మరునాడు తెల్లవారగానే, నగర ప్రజలు బిందెలలో పాలను తీసుకుని శివాలయం కేసి బయలుదేరారు. కొంత సేపటికల్లా రద్దీ ఎక్కువ కావడంతో ఆలయం ఎదుట పెద్ద వరుస ఏర్ప డింది. వాళ్ళందరూ కూడా రాజాజ్ఞ ప్రకారం ఆవుల దూడలకు సైతం ఒక్క చుక్క పాలు కూడా మిగల్చకుండా తెచ్చేశారు. దాంతో ఆ రోజు శిశువులకూ, పిల్లలకూ, వృద్ధులకూ, వ్యాధిగ్రస్తులకూ పాలు లభించలేదు.

పొద్దెక్కే కొద్దీ కొలను మెల్ల మెల్లగా నిండ సాగింది. అయినా, మధ్యాహ్నానికిసగం మాత్రమే నిండింది. ఆ తరవాత ఎన్ని బిందెలు కుమ్మ రించినా పాలు ఒక్క అంగుళం కూడా పైకిరాలేదు. దానిని చూసి ప్రజలు ఆశ్చర్యపోయారు.

ఎందుకిలా జరుగుతున్నదో తెలియక ఆలయ పూజారులు, ఆలయంలో గుమిగూడిన భక్తులు భయాందోళనలకు గురయ్యారు. "నగరంలోని ప్రతి గృహస్తూ పాలు తెచ్చి పోశాడు. అయినా కొలను నిండలేదు. శివుడు మన పట్ల అసంతృప్తిని కనబరుస్తున్నాడా? మనకు తెలియక ఏదైనా పాపకృత్యం చేశామా? శివాపచారం ఏదైనా జరిగిందా?" అని ఒక పెద్దమనిషి వాపోయాడు.

ఆ మాట వినగానే పూజారులు మరింత ఆందోళనకు లోనయ్యారు. అయినా వీటన్ని టినీ పట్టించుకోకుండా ఒక ముసలావిడ, అప్పుడే ఆలయ ప్రాంగణం లోకి అడుగు పెట్టింది. ఆమె నగరం శివా ర్లలో ఉంటున్నది. తెల్లవారక ముందే లేచి దూడలకు కొంచెం వదిలి ఆవుల నుంచి పాలు పితికింది. ఇంట్లోని వాళ్ళకందరికీ కావలసినంత పాలు ఇచ్చింది. ఇంటి పనులన్నీ ముగించు కుని, వీటన్నిటికి పోగా మిగిలిన గిన్నెడు పాలు తీసుకుని, రాజాజ్ఞను నెరవేర్చడానికి శివాలయానికి వచ్చింది. కొలను మెట్లపై నిల బడి, "కరుణామయుడివైన దేవా! ఈ గిన్నెడు పాలనే నేను ఇవ్వగలను. భక్తితో సమర్పిస్తున్న దీనిని గొప్ప మనసుతో స్వీకరించి, మమ్మల్నం దరినీ రక్షించు!" అంటూ భక్తితో ప్రార్థిస్తూ, పాలను కొలనులోకి పోసింది.

అంతే! ఆ మరుక్షణమే పాలతో సగం వరకే ఉన్న కొలను పూర్తిగా పాలతో నిండి పోయింది. అయినా, ఆ వృద్ధురాలు దాన్నేమీ పట్టించు కోకుండా వచ్చినదారినే తిరిగి వెళ్ళిపోయింది.

ఆ తరవాత ఆలయానికి వచ్చిన రాజు, కొలను పాలతో నిండి ఉండడం చూసి పరమా నందం చెంది, శివలింగానికి ఘనంగా క్షీరాభి షేకం చేయించాడు!

రెండవ సోమవారం కూడా అలాగే జరి గింది. నగరంలోని ప్రజలందరూ తమ వద్ద ఉన్న పాలన్నింటినీ తెచ్చి కొలనులో పోశారు; అయినా వృద్ధురాలు వచ్చి తనవంతు పాలు





పోసేంతవరకు కొలను సగమే నిండింది. ఆమె వచ్చి గిన్నెడు పాలు పోయగానే కొలను పూర్తిగా నిండిపోయింది.

ఆ సంగతి రాజుకు తెలియడంతో, దాని రహస్యమేమిటో తెలుసుకోవాలనుకున్నాడు. అందువల్ల మూడవ సోమవారం ఏం జరుగుతున్నదో చూడాలన్న కుతూహలంతో కాపలా భటుడి వేషం ధరించి తెల్లవారకముందే కొలను వద్ద నిలబడ్డాడు. ఎప్పటిలాగే ప్రజలు బిందెలలో పాలు తెచ్చి కొలనులోకి కుమ్మరించసాగారు. కొలను సగం వరకు నిండి అలాగే ఆగిపోయిందే తప్ప, ఆ తరవాత ఎన్ని బిందెల పాలు పోసినా ఏమాత్రం పెరగలేదు.

మధ్యాహ్నవేళకు గిన్నెనిండా పాలతో వచ్చిన వృద్ధురాలు, ''పరమేశ్వరా, నేను మిగల్చ గలిగినంత పాలు తెచ్చి నీకు భక్తితో సమర్పిస్తున్నాను. అపార కరుణాసముద్రుడివైన నువ్వు దయతో స్వీకరించగలవని దృఢంగా విశ్వసిస్తున్నాను. మమ్మల్నందరినీ చల్లగా చూడు తండ్రీ,'' అంటూ గట్టిగా ప్రార్థిస్తూ పాలను కొలనులో పోసి, వెనుదిరిగింది. ఆ క్షణమే పాలు పొంగుతూ కొలను నిండిపోయింది. ఆ అద్భుత దృశ్యం చూసిన రాజు అబ్బురపడ్డాడు. ఒక్క గెంతున ముందుకు వచ్చి వృద్ధురాలి దారికి అడ్డంగా నిలబడి ఆమెను ఆపాడు.

''నన్నెందుకు ఆపావు నాయనా? నేనేం తప్పు చేశాను?'' అన్నది వృద్ధురాలు భయంతో కంపిస్తున్న కంఠస్వరంతో.

''భయపడకమ్మా, నేనీ రాజ్యాన్ని పాలించే రాజును. నీ నుంచి ఒక విషయం తెలుసుకోవాలి. పొద్దుట్నుంచి ప్రజలందరూ శివాభిషేకం కోసం బిందెలతో పాలను తెచ్చి కొలనులో పోశారు. అయినా, అది సగం వరకే నిండి అలాగే ఉండి పోయింది. నువ్వు వచ్చి గిన్నెడు పాలు పోయగానే, అంచుల వరకూ నిండి పోయింది. ఎందుకిలా జరిగిందో చెప్పగలవా?'' అని అడిగాడు రాజు.

''ప్రభూ, నేనొక తల్లిని. కన్న బిడ్డలు ఆకలితో అలమటించడం ఏ తల్లీ చూడ జాలదు కదా! అందువల్ల తమ ఆజ్ఞను పూర్తిగా పాటించలేక పోయాను. పాలు పితికేప్పుడు లేగలకు కొంచెం వదిలి పెట్టాను. పిండిన పాలను నా పిల్లలకూ, మనమలకూ ఇవ్వగా మిగిలిన గిన్నెడు పాలనే తెచ్చి శివుడి అభిషేకానికి సమర్పించాను. సకల జీవరాశులకూ తల్లీ తండ్రీలాంటివాడు కదా శివుడు. తన బిడ్డలకు ఆహారం లేకుండా

చేయడం ఆయన ఆమోదించగలడా? ప్రభూ, ఉన్న మాట అంటున్నందుకు క్షమించాలి. తమరు చేసింది అదే కదా! ప్రజలందరూ దూడలకూ, పిల్లలకూ, వృద్ధులకూ, రోగులకూ మిగల్చకుండా పాలన్నిటినీ తీసుకురావాలని ప్రజలను ఆజ్ఞాపించారు కదా. ప్రజలకది ఇష్టం లేదు. బాధ కలిగించింది. తమ ఆజ్ఞను మీరలేక, అయిష్టంగానే పాలను తెచ్చి సమర్పించారు. శివుడికిది ఇష్టం లేదు. అందుకే అసంతృప్తి వ్యక్తం చేశాడనుకుంటాను,'' అన్నది వృద్ధురాలు.

ఆ మాట విని రాజు దీర్ఘాలోచనకు లోనయ్యాడు. ''అవును, ఆ వృద్ధురాలి మాట అక్షరాలా నిజం. కన్న తండ్రిలా, ప్రజల అవసరాలకు, ఆరోగ్యానికి ఎలాంటి కొరతా లేకుండా చూడడం రాజు బాధ్యత. అయితే ఇప్పుడు తను చేసిందేమిటి? అభిషేకం పేరుతో పిల్లలకూ, పెద్దలకూ ఆఖరికి నోరులేని లేగలకు సైతం పాలు లభించకుండా చేస్తున్నాను. ఇది ఘోర పాపమే అవుతుంది. దీన్ని దేవుడెలా ఆమోదించగలడు? నన్నెలా ఆశీర్వదిస్తాడు?'' అనుకుంటూ తీవ్రమైన అంతర్మథనానికి లోనయ్యాడు. ఒక విధమైన అపరాధభావమూ, అవమానమూ ఆయన్ను ఆవరించాయి.

ఆ తరవాత వృద్ధురాలికేసి తిరిగి, ''నాకు నిజమైన భక్తి మార్గం చూపి, నా కళ్ళు తెరిపించావు. కృతజ్ఞతలు తల్లీ,'' అంటూ చేతులు జోడించాడు.

రాబోయే సోమవారం లేగలకూ, పిల్లలకూ, వృద్ధులకూ ఇవ్వగా మిగిలిన పాలను మాత్రం శివుడి అభిషేకానికి తెచ్చి ఇస్తే చాలునని అప్పటి కప్పుడే నగరమంతటా చాటింపు చేయించాడు.

మరుసటి సోమవారం, అంటే ఆఖరి శ్రావణ సోమవారం రానే వచ్చింది. తెల్లవారేసరికి నగర ప్రజలు తాము మిగల్చగలిగిన పాలతో ఆలయం వద్దకు వచ్చారు. రాజు సైతం, లేగలకూ, రాజ భవనంలోని పిల్లలకూ ఇవ్వగా మిగిలిన పాలను మాత్రమే తెచ్చి, అభిషేకానికి కొలనులో పోశాడు. దాని ఫలితం వెనువెంటనే తెలియ వచ్చింది. రెండుబారల పొద్దెక్కే సరికి కొలను పాలతో నిండిపోయింది!

వృద్ధురాలు వచ్చేంతవరకు రాజు అక్కడే కాచుకుని ఉన్నాడు. ఆమె వచ్చి, తన వంతు పాలు సమర్పించాక, రాజు ఆమెను సాదరంగా ఆలయం లోపలికి తీసుకువెళ్ళాడు. ఉభయులూ కలిసి శివుడికి క్షీరాభిషేకం నిర్వహించారు.

''ఆఖరికి దేవుడు నిజంగానే ఆనందించాడు. చాలా కృతజ్ఞతలు తల్లీ,'' అన్నాడు రాజు ఎంతో ఆనందంతో.





## ఎవరెస్ట్ శిఖరంపై మహిళా సైనికులు!

భారత సైన్యానికి చెందిన నలుగురు మహిళలు గత జూన్ నెలలో ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించి చరిత్ర సృష్టించారు. ఎత్తయిన ఆ శిఖరాన్ని అధిరోహించిన అందరూ మహిళలేగల జట్టు వారిదే కావడం విశేషం. చైనా దేశం వైపునుంచి జూన్ రెండవ తేదీ కేప్టన్ షిప్రా మజుందార్, కేప్టన్ అశ్వినీ పవార్, కేడట్ ట్సేరింగ్ లాడోల్, ట్రెయినీ డెచ్చీ ల్హామో అనే ఆ నలుగురు వీరవనితలు 8,848 మీ. ఎత్తయిన శిఖరాన్ని అధిరోహించారు. వాళ్ళు తమ పర్వతారోహణ యాత్రను మార్చ్ 18వ తేదీ ప్రారంభించారు.

## అసాధారణ ప్రతిభ!

తమిళనాడులోని తిరుచ్చికి చెందిన వైష్ణవి, కంప్యూటర్ సైన్స్ చదవడానికి ఇప్పుడే ఇంజినీరింగ్ కాలేజీలో చేరింది. ఆమెకు రామాయణం, తిరుక్కురళ్ కంఠతా వచ్చు. జ్ఞాపకశక్తితోనే ఏ పద్యాన్నయినా సులభంగా రాయగలదు. అంతే కాదు. ఆ పద్యాలను కావాలంటే కుడినుంచి ఎడమకు కూడా రాయగలుగుతున్నది. వాటిని మనం అద్దం సాయంతోనే చదవగలం. ఇంగ్లీషూ, తమిళం రెండు భాషలనూ ఆమె ఇలా సునాయాసంగా రాయగలదు. ఎ4 సైజు పేపర్ నింపడానికి ఇంగ్లీషయితే పదినిమిషాలూ, తమిళం అయితే ఇరవై నిమిషాలూ తీసుకుంటుంది. ఇలా రాయాలంటే ఆమె తన ఎడమ చేతిని ఉపయోగిస్తుంది. మామూలుగా అందరిలా రాయడానికి కుడి చేతిని ఉపయోగిస్తుంది. ఆమె బడికి వెళ్ళక ముందే ఇలా రాయడం గమనించిన వాళ్ళ మామయ్య ఉర్దూ రాస్తుందేమిటా అని ఆశ్చర్య పోయాడు. బడిలో ఆమె మామూలుగా రాయడానికి ఉపాధ్యాయులు శిక్షణ ఇచ్చారు. అయినప్పటికీ ఎడమ చేత్తో రాసే అలవాటును మాత్రం ఆమె మానుకోలేదు. పైగా, పట్టుదలతో ఆ ప్రతిభను పెంపొందించుకున్నది. ఇప్పుడు కూడా ఆమె దీనికోసం రోజూ ఒక గంట సేపు కేటాయించి, క్రమం తప్పకుండా అభ్యాసం చేస్తున్నది.



# THE ADVENTURES OF G-man

## ఆండ్రోమేనియా

### అల్టిమేటం భాగం 2

జరిగిన కథ: జి-మ్యాన్, అతని స్నేహితులు టెర్రోలీస్ వద్ద వున్న పూర్తి రోబోటిక్ సైన్యాన్ని నాశనం చేస్తారు. అలా అని వాళ్ళు అనుకుంటారు. టెర్రోలీస్ హతాశుడయ్యాడే కాని, ఓడిపోలేదు. వాళ్ళపై ప్రయోగించేందుకు అతని దగ్గర మరో ఆశ్చర్యకరమైన జిత్తు వుంది.













అతనూ తప్పక చెయ్యగలడు. మీ జీ-షీల్డ్స్‌ని ధరించి, ప్రతివారూ పోరాటం సాగించండి.










అది నిజమేనా?

నేను నా కళ్ళని నమ్మలేకపోతున్నాను..

నేస్తాలూ, మీరు చూస్తున్నది మీకు నచ్చడంలేదు కదూ?

నేను కాస్త విశ్రాంతి తీసుకుంటాను. నా ఆండ్రోయిడ్లని* తమ పనిని చెయ్యమని చెబుతాను. ఆండ్రోమానియా ఇప్పుడే మొదలైంది.

*ఆండ్రోయిడ్: ఇది మనిషిలా అనిపించే, ఒక కృత్రిమంగా సృష్టించబడిన జీవి.




చింతించకండి, నేస్తాలూ, అవి మనలా కనిపించవచ్చు.
కానీ వాటికి మనలాంటి యుద్ధపు అనుభవం లేదు.


ఇది కాస్త నయం.


ఇది వింతగా అనిపించడం లేదూ?
ఇప్పుడు గ్రహించావా నువ్వు?


కాదోయ్, వాటి శక్తులు చూడు
ఎలా అభివృద్ధి చెందుతున్నాయో?


అవును, అవి తమ సహచరులనుండి
నేర్చుకుంటున్నట్లున్నాయి.


మ్మ్..మ్మ్.. పోయినసారి నేను ఈ రోబోలతో* యుద్ధం చేస్తున్నప్పుడు
అది నేను గ్రహించాను. దీనికి ఒకే ఒక వివరణ ఉంటుంది.


ఏమిటది?


నా అంతట నేనే చూడాలని. మీరు ఇక్కడ
సంభాళిస్తూ వుండండి. నేనిట్టే వెళ్ళి, వచ్చేస్తాను.
*ఆంధ్రోమానియా భాగం-1



జీ-మ్యాన్, టీ-టవర్ బేస్‌మెంట్ వరండాల్లో నుండి దూసుకుపోతాడు.






అచ్చు నేననుకున్నట్లే, వీటినన్నిటినీ ఒకే ఒక
సూపర్ కంప్యూటర్ అదుపులో ఉంచుతోంది.
అందువల్లనే ఇవన్నీ పునఃసృష్టింపబడుతున్నాయి.






జి-మ్యాన్ అన్ని దిశల్లోనూ ఫైరింగ్ చేస్తాడు, కనుచూపు మేరదూరంలో ఉన్న అన్నిటినీ నాశనం చేస్తాడు.




జీ-మ్యాన్, బాగా వుందోయ్ నీ ప్రదర్శన.
సరే, నువ్విదంతా ఎలా చేశావో మాకు చెప్పు.


ఇప్పుడు కాదు. ఇక్కడ నాకు జుగుప్స కలుగుతోంది.
మనం ఇక్కడ ఎంతో మందిమి అయిపోయాం.


అవును, నువ్విప్పుడు నాపై కూర్చుని ఉన్నావు.


కాఫీ తాగుతూ మాట్లాడుకుందామా?
ఇప్పుడు నాకు కాఫీ
కన్నా మరేదో కావాలి.




PARLE
Parle-G


మీరందరూ ఇళ్ళకి వెళ్ళిపోదామన్న తొందరలో లేరనుకుంటాను. ఇక్కడివన్నీ మీకు చూపిస్తాను రండి.
నేను రాను.


నువ్వు రాకపోయినా పరవాలేదు.
అంటే అర్థమేమిటంట?


హెహెహె.. ఏమీ లేదు. కానీ నా ప్రపంచాన్ని రక్షించడంలో సాయపడతానన్న నీ వాగ్దానం మరిచిపోకు.
నేను మర్చిపోలేదు.. సరే మనం కాస్త కాఫీ తాగుదామా?

సమాప్తం

# వీరముష్టి!

బుద్ధవరం అనే ఒక చిన్న పట్టణంలో, నారన్న అనే మంచి మాటకారి బిచ్చగాడుండేవాడు. వాడు బిచ్చం కోసం తిరిగే వీధుల్లో ఒకచోట పెద్దవడ్డీవ్యాపారివుండేవాడు. నారన్నకు మామూలు ఇళ్ళల్లో బిచ్చం సులువుగా దొరికినా, అది వాడి రోజువారీ తిండికి సరిపోయేదికాదు. వడ్డీ వ్యాపారి నుంచి అయితే, ఏదో కొంత భారీగా డబ్బు ముట్టుతుందని, వాడి ఆశ.

కానీ, వడ్డీవ్యాపారి భవనద్వారం దగ్గరుండే కాపలావాడు, నారన్న అటుకేసి నాలుగడుగులు వేయగానే, పోపొమ్మంటూ కసురుకునేవాడు. వడ్డీ వ్యాపారి కంటబడడం ఎలాగా అని వాడు బాగా ఆలోచించి, ఒకనాడు వ్యాపారి ఇంటికాపలావాడు కొంచెందూరంలో ఎవరితోనో మాట్లాడు తుండగా, ధైర్యం చేసి ద్వారం గుండా లోపల ప్రవేశించి, ''అయ్యా, వడ్డీ వ్యాపారిదాతగారూ!'' అంటూ కేకపెట్టాడు.

నారన్న అలా భవనం లోపలికిరావడం, ఆ కేకలూ విని వ్యాపారి పనివాళ్ళు, వాణ్ణి బయటకు నెట్టేసేందుకు ప్రయత్నించారు. ఐతే, వాడు మరింతగా కేకలు పెట్టడం ప్రారంభించాడు. భవనం పైగదిలో వడ్డీ లెక్కలు చూసుకుంటున్న వ్యాపారి కిందికి దిగి వచ్చి, గొడవకు కారణం తెలుసుకుని, నారన్నకు ఐదు రూపాయిలిస్తూ, ''ఒరే, నీదేదో వీరముష్టిలా వుంది! ముష్టి అడిగే పద్ధతి ఇది కాదు. నువ్వింత గొడవ చేయకపోతే, ఐదు కాదు పది రూపాయలిచ్చి వుండేవాణ్ణి,'' అన్నాడు.

నారన్న డబ్బును జోలెలో వేసుకుని, వడ్డీ వ్యాపారితో, ''అయ్యా, ఇంతవరకు ఒళ్ళు హూనమయ్యేలా మీ పనివాళ్ళు వడ్డించింది చాలు. అయినా, మీ వృత్తి వడ్డీ వ్యాపారం. అదెలా చేయాలో మీకు నేను సలహాయివ్వలేదు. నేను వృత్తి బిచ్చగాణ్ణి. నాకు బిచ్చం ఎలా ఎత్తాలన్నదాన్ని గురించి సలహాలివ్వకండి!'' అంటూ అక్కడి నుంచి వెనుదిరిగాడు.





# పాఠకులకు కథల పోటీ ఫలితాలు

## పెరిగిన బండిబాడుగ (జూన్)



షినారి తండ్రి ఒకడు కొడుకును వెంటబెట్టుకుని పట్నం బయలు దేరాడు. పట్నం వెళుతూ దారి పొడవునా, ఎదురుపడ్డ బాడుగ బండ్లను బేరమాడబోతే పది, పదిహేను, ఇరవై రూపాయలు అంటూ పెంచు కుంటూవెళ్ళారు. తండ్రి మూడో బండివాణ్ణి కూడా వెళ్ళిపొమ్మన డంతో, ఆశ్చర్యం చెందిన కొడుకు, ''మూడో బండివాణ్ణి కూడా పంపే శావు. మరి మనం పట్నం చేరేదెలా?'' అని అడిగాడు విసుగ్గా.

''మనం అలిసిపోయి ఉన్నాం; నడవలేము ఎలాగూ బండి ఎక్కి తీరుతాం, అన్న నమ్మకంతో బండివాళ్ళు అలా బాడుగను పెంచు కుంటూ వెళ్ళారు. అయినా, మనం ఇప్పటికే సగం దూరానికి పైగా వచ్చేశాం. ఈ కొద్ది దూరానికి ఇరవై రూపాయలు ఇవ్వడం దేనికి? ఇంకాస్సేపు నడిస్తే పట్నం చేరు కుంటాం. డబ్బుకు డబ్బూ ఆదా, ఆరోగ్యానికి ఆరోగ్యం. నడక ఆరోగ్యానికి మంచిది కదా?'' అంటూ తండ్రి ముందుకు నడిచాడు.

*ఓగిరాల అనిరుద్ కృష్ణ, నెల్లూరు - 524 002 (ఆం.ప్ర)*

## ''అవును, సందేహం దేనికి?'' (జూలై)



పరమశివం సంతకువెళ్ళి మాట్లాడే చిలుక అని నమ్మి, వంద రూపాయ లిచ్చి, ఒక చిలుకను కొని తెచ్చి, పిల్లలకిచ్చాడు. తీరా ఇంటికి వచ్చాక ఆ చిలుకకు, ''అవును, సందేహం దేనికి?'' అన్న మాట తప్ప మరో మాట రాదని తెలిసి, తను మోసపోయినట్టు గ్రహించి బాధపడసాగాడు.

ఒక వారం తరవాత సంత జరిగే రోజు రాగానే, పరమశివం చిలుకను తీసుకుని వ్యాపారి వద్దకు వెళ్ళి, ''పోయిన వారం ఈ చిలుకను నాకు యాభై రూపాయలకు అమ్మావు కదా? వంద రూపాయల నోటు ఇస్తే యాభైకి తరవాత రమ్మన్నావు. ఏదీ యాభై రూపాయలు?'' అని అడిగాడు. వ్యాపారి బాకీ లేదని చెప్పాడు. ఇద్దరి మధ్య గొడవ అయింది. ఆ గొడవ విని చుట్టూ జనం చేరారు. వాళ్ళల్లో నుంచి ఒక పెద్దమనిషి, ''నీకు వ్యాపారి యాభై రూపాయలు ఇవ్వాలనడానికి ఏదైనా సాక్ష్యం ఉందా?'' అని అడిగాడు.

''ఎందుకు లేదూ? ఈ చిలుకే సాక్ష్యం. కావాలంటే మీరే అడగండి!'' అన్నాడు పరమశివం.

ఆ పెద్దమనిషి చిలుకను సమీపించి, ''ఈ వ్యాపారి, పరమశివానికి యాభై రూపాయలు బాకీ ఉన్నాడా?'' అని అడిగాడు. ''అవును, సందేహం దేనికి?'' అన్నది చిలుక వెంటనే.

వ్యాపారి పరమశివానికి యాభై రూపాయలు ఇవ్వక తప్పలేదు. వ్యాపారికి సరైన గుణపాఠం నేర్పినందుకు సంతోషిస్తూ పరమశివం చిలుకతో ఇంటికేసి బయలుదేరాడు.

*ఎం. అనూష, హైదరాబాద్ (ఆం.ప్ర)*

# ఉత్తమ బహుమతి పొందిన ముగింపు!

## విదూషకుడి వివరణ (ఆగస్ట్)



"ఈ భూమి మీద అత్యంత వేగంగా పరిగెత్తే ప్రాణి ఏది?" అన్న రాజుగారి ప్రశ్నకు పలువురి సమాధానాలు తృప్తినివ్వక పోగా, చివరగా ఆస్థాన విదూషకుడు, "ఈ భూప్రపంచంలో అత్యంత వేగంగా పరిగెత్తే ప్రాణి నేనే అనుకుంటాను," అన్నాడు.

ఆ మాటకు మొదట ఆగ్రహించిన రాజు, ఆ తరవాత శాంతించి, "అదెలా?" అని అడిగాడు.

"ఈ ప్రపంచంలో అన్ని ప్రాణులకన్నా, ఆ మాటకొస్తే వాయువుకన్నా వేగంగా పయనించేది మనస్సు అన్న సత్యం తమకు తెలియనిది కాదు. మామూలు మనుషులకన్నా నాలాంటి వారి మనసు మరింత వేగంగా పయనిస్తుంది. నా మటుకు నేను భావప్రపంచంలో నిరంతరం పరుగులు తీస్తూ ఉంటాను. అందుకే హాస్య రసోక్తులతో రసికులైన తమబోటి రాజులనూ, సభికులనూ రంజింప జేయగలుగుతున్నాను!" అన్నాడు.

రాజు ఆ మాటకు ఎంతగానో సంతోషించి విదూషకుణ్ణి విలువైన బహుమతులతో ఘనంగా సత్కరించాడు.

ఆర్. సాయి విజయ్‌కృష్ణ, హైదరాబాద్-500 036 (ఆం.ప్ర)

## పిచ్చాసుపత్రి (సెప్టెంబర్)



ఆ వ్యక్తి లేచి తన కేసి మెల్లగా రావడం గమనించిన గోపాల్ హడలి పోయాడు. ఒక్క గెంతున లేచి పరిగెత్తాడు. ఎదురుగా లిఫ్ట్ కనిపించడంతో అందులోకి జొర బడి తలుపు మూసుకున్నాడు. బతికి పోయానన్న ఆనందంతో గోపాల్ మరొక బటన్ను నొక్కేసరికి లిఫ్ట్ తలుపు మళ్ళీ తెరుచుకున్నది. అంతలో గోపాల్ వెంటబడి వచ్చిన ఆ వ్యక్తి లిఫ్ట్‌లోకి వచ్చేశాడు. అయితే గోపాల్ అతి ప్రయత్నం మీద అతన్ని వెలుపలికి తోసేసి తలుపు మూసుకున్నాడు. లిఫ్ట్ పైకి కదిలింది. అంతకు ముందే లిఫ్టులో ఉన్న ఆ ఆస్పత్రిలో పనిచేసే నర్సు, "ఏమయింది?" అని అడిగింది. గోపాల్, "తేలు చెప్పులు! ఉడికించినవా? వేయించినవా?" అన్నాడు యథాలాపంగా.

లిఫ్ట్ పై అంతస్తును చేరగానే, నర్సు గోపాల్ చేయిపట్టుకుని ఎదుట ఉన్న గది కేసి నడిపించింది. ఆ గది తలుపుకు 'డాక్టర్' అనే బోర్డు కనిపించింది!

ప్రియదర్శన్ జె. బాబు, ముంబై - 400 012.

## మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (2)

# ఓటమిలోనూ గెలిచిన యోధుడు!

భారతదేశ చరిత్ర క్రీ.పూ. 326 వ సం:లో కొత్త మలుపు తిరిగింది. రాజ్యకాంక్షాపూరితుడైన యువవీరుడూ, సాహస ప్రియుడూ అయిన గ్రీకుదేశం మెసిడోనియా రాజు అలెగ్జాండర్ (356-323) మన దేశంపై దండయాత్ర చేసిన సంవత్సరం అది. తక్షశిల పాలకుడైన అంభి ఆయనకు సాదర స్వాగతం పలకకుండా ఉన్నట్టయితే, అలెగ్జాండర్‌ను భారత భూభాగంపై పాదం మోపకుండా తరిమి కొట్టి ఉండవచ్చు. అంభి ఆ చర్యకు కారణం అతిథుల పట్ల ఆదరభావం కాదు. జీలం నదీ తీరంలో సిరి సంపదలతో, శాంతి భద్రతలతో రాజ్యమేలుతూన్న తన పొరుగు రాజు పురుషోత్తముణ్ణి ఓడించాలన్న దురాశే అందుకు కారణం!

పరాయి చక్రవర్తికి పాదాక్రాంతుడై, తాను దాసోహం అనడమే గాక, అంభి ఇరుగు పొరుగు రాజులనుసైతం, తన సభకు రప్పించి, అలెగ్జాండర్ ఆధిపత్యాన్ని అంగీకరించేలా చేయడానికి ప్రయత్నించాడు. చిన్నా చితక పాలకులు అందుకు సమ్మతించి తలలు ఒగ్గారు. అయితే, ధైర్యశాలీ, మానధనుడూ అయిన పురుషోత్తముడు మాత్రం అందుకు అంగీకరించలేదు!



ఆ కాలంలో మనరాజులు యుద్ధాలలో గజబలాన్ని, అంటే ఏనుగులను ఉపయోగించేవారు. శిక్షణ పొందిన బ్రహ్మాండమైన ఆ జంతువులను ఎలా ఎదుర్కోవాలో గ్రీకు సైనికులకు తెలియలేదు. అయితే, అంభి వారికి ఏనుగులను ఎదుర్కొనే పద్ధతులను, మెళకువలను నేర్పి సాయపడ్డాడు.

అలెగ్జాండర్ జీలంనది కేసి సేనలను నడిపించి నదీ తీరం చేరాడు. నదిని దాటడం అంత సులభంగా తోచలేదు. సైనికులు పడవలలో వెళ్ళేప్పుడు పురుషోత్తముడి సేనలు ఎదుర్కో

వచ్చు. అలెగ్జాండర్ కొన్నాళ్ళు అక్కడే బసచేసి తీవ్రంగా ఆలోచించసాగాడు. అంతలో అంభి అంతగా లోతులేని నదీ ప్రాంతాన్ని చూపాడు. వెంటనే అలెగ్జాండర్ ఒక పథకం ఆలోచించాడు. కొందరు సైనికులను పడవలలో నదిని దాటమని ఆజ్ఞాపించాడు. పడవలలో వస్తూన్న సైనికులను ఎదుర్కోవడంలోనే పురుషోత్తముడు గురిగా ఉన్న సమయంలో, అలెగ్జాండర్ సేనలు మరోవైపు నీళ్ళు తక్కువగా ఉన్న చోట నదిని దాటి ఆవలి తీరం చేరాయి.

అనూహ్యమైన ఈ పరిణామానికి దిగ్భ్రాంతి చెందిన పురుషోత్తముడు, మరుక్షణమే శత్రు సేనలను ధైర్యంగా ఎదుర్కొన్నాడు. ఆ రోజంతా తన కన్నా ఎంతో బలమైన శత్రుసేనలతో సాహసోపేతంగా పోరాడాడు. ఇరవై వేలకు పైగా సైనికులు హతులయ్యారు. సూర్యాస్తమయ సమయానికి పురుషోత్తముడు గుర్రంపై ఒంటరిగా మిగిలాడు. అయినా, తనను బంధించడానికి వచ్చే శత్రుసైనికులను తెగ నరకడానికి సిద్ధమయ్యాడు. ఆయన అనుపమాన ధైర్యసాహసాలను ప్రత్యక్షంగా చూసిన అలెగ్జాండర్ ముగ్ధుడయ్యాడు. లొంగిపొమ్మని అంభి ద్వారా సందేశం పంపాడు. భయం భయంగా తనను సమీపించిన అంభిని చూడగానే, ''దేశద్రోహీ! నీ ముఖం నాకు చూపకు. పారిపో, పిరికి పందా,'' అని పురుషోత్తముడు గర్జించాడు.

మరికొంత సేపటికి పురుషోత్తముడు తీవ్రంగా గాయపడ్డాడు. నుదుటితో సహా శరీరమంతా నెత్తురోడుతున్న తొమ్మిది గాయాలు. అయినప్పటికీ బాధనూ, విషాదాన్నీ ఆయన ఏమాత్రం బయట పెట్టలేదు.

అలెగ్జాండర్ దళనాయకులు ఆయన్ను చుట్టుముట్టి తమ రాజు వద్దకు నడిపించారు. క్షమాగుణం నలుసంత కూడా లేని తమ రాజు పురుషోత్తముణ్ణి వెంటనే శిరశ్ఛేదం చేయగలడనే గ్రీకు సైనికులు భావించారు. ఎందుకంటే శత్రువులను ఏమాత్రం ఉపేక్షించని కఠిన స్వభావం ఆయనది. ఆయన రాజ్యకాంక్ష కలవాడు మాత్రమే కాదు; పరమ కోపిష్ఠి. ఒకసారి ఆయన మిత్రుడు అనారోగ్యం పాల



య్యాడు. శీతల మద్యపానం, మాంసాహారం ముట్టుకోకూడదని వైద్యులు సలహా ఇచ్చారు. వైద్యుల సలహాను పెడచెవిని పెట్టడంతో అతడు మరణించాడు. మిత్రుడి మరణాన్ని భరించలేని అలెగ్జాండర్, ఆగ్రహంతో వైద్యులందరికీ మరణశిక్ష విధించాడు! అంతేకాదు;



కుతంత్రాలు, ద్రోహ చింతనలు లేకుంటే అతడు ఓడేవాడు కాడని ఆయనకు తెలుసు! ''పురుషోత్తమా! యుద్ధం ముగిసింది. నిస్సహాయుడుగా నిలబడి ఉన్నావు. నిన్నెలా చూడమంటావు?'' అని అడిగాడు అలెగ్జాండర్.

''అలెగ్జాండర్, నువ్వు న్యాయబద్ధమైన చక్రవర్తివే గనక అయితే, సాటి చక్రవర్తిని ఎలా గౌరవించాలో నీకే తెలుసు!'' అన్నాడు పురుషోత్తముడు గంభీరంగా.

''అవును. చక్రవర్తికి తగ్గ గౌరవంతో నిన్ను నడిపించాలి. మరింకేదైనా కోరుకుంటున్నావా?'' అని అడిగాడు అలెగ్జాండర్ మళ్ళీ.

''లేదు. నువ్వు నన్ను సాటి చక్రవర్తిగా గౌరవిస్తే, నాకు అవసరమైనవిసమస్తం అందులోనే సమకూరుతాయి కదా!'' అన్నాడు పురుషోత్తముడు నిస్సంకోచంగా.

మరణించిన తన మిత్రుడి ఆత్మకు ప్రేతాత్మల రూపంలో తోడుగా ఉంటారని ఆ గ్రామ ప్రజలందరినీ హతమార్చాడు. అలెగ్జాండర్ నిర్దాక్షిణ్యమైన కర్కశ స్వభావాన్ని చాటే సంఘటనలు ఇవి!

అలెగ్జాండర్ తన పర్షియన్ జైత్రయాత్రలో ఎందరో రాజులను ఓడించాడు. అయినా, ఈ స్థితిలోనూ తనతో ద్వంద్వ యుద్ధానికి సుముఖంగా ఉన్నట్టు కనిపించిన పురుషోత్తముడి వంటి వీరుణ్ణి ఆయన ఎన్నడూ చూడలేదు. బందీగా నిలబడ్డ అతన్ని ఒకసారి మెచ్చుకుంటున్నట్టు చూశాడు. అంభి కుట్రలు,

ఆ మాటకు అలెగ్జాండర్ ముగ్ధుడయ్యాడు. పురుషోత్తముడి రాజ్యాన్ని వశపరచుకోకుండా వదిలిపెట్టాడు.

పురుషోత్తముడు కనబరచిన అసమాన ధైర్యం, అచంచలమైన ఆత్మస్థైర్యం, అసాధారణ ఆత్మగౌరవం అలెగ్జాండర్‌ను అబ్బురపరచాయి. మనిషిలోని నిర్భీతి, ఉన్నత గుణాలు శత్రువులను సైతం ప్రభావితం చేస్తాయి!

పరస్పర ఉదాత్త గుణాలతో పురుషోత్తముడు, అలెగ్జాండర్ ఉభయులూ పరమానందం చెందారు. అయితే, అంభి మాత్రం విషాదగ్రస్తుడయ్యాడు. –(ఎం.డి)

# చందమామ క్విజ్ - 1

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

ఈ సంచికనుంచి పాఠకులకు ఒక ఆసక్తికరమైన క్విజ్‌ను నిర్వహించదలిచాం. ఈ క్విజ్‌లో అడిగే ప్రశ్నలన్నీ 2005 జనవరి– డిసెంబర్ మధ్య వెలువడిన చందమామ సంచికలలోని కథలు, శీర్షికల నుంచే ఉంటాయి. చదివినవి జ్ఞాపకం ఉంటే వీటన్నిటికీ సమాధానాలు వెంటనేస్ఫురిస్తాయి. లేకుంటేపన్నెండు సంచికలను పక్కన పెట్టుకుని తిరగేస్తే ఇట్టే తెలిసిపోతాయి. కనుగొనడం కూడా చాలా సరదాగా ఉంటుంది.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్లయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికి సమానంగా పంచబడుతుంది.

<u>మీరు చేయవలసిందేమంటే</u> : 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి), పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ క్విజ్– 1 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. ఫిబ్రవరి నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. ఏప్రిల్ నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.

1. ప్రపంచ వారసత్వ అంతస్తు కల్పించబడిన మనదేశంలోని సుప్రసిద్ధ రైల్వే స్టేషన్ ఏది?
2. ''గుడ్లగూబకు చీకటి అంటే మహా ఇష్టం. సోమరితనం, అజ్ఞానంతో బతికే నువ్వు చీకటి కంటే కటిక చీకటివి. అందుకే గుడ్లగూబ నిన్ను ఆశ్రయించింది.'' ఈ మాటలు ఏ కథలో చోటు చేసుకున్నాయి?
3. మనదేశంలోని జగత్ప్రసిద్ధమైన స్మారక భవనం నిర్మించి 350 సంవత్సరాలయింది. అది ఏది?
4. జూడో, కరాటే, కుంగ్‌ఫూ యుద్ధకళల ఆవిర్భవానికి దోహదం చేసిందని చెప్పబడే కేరళ ప్రాంతానికి చెందిన యుద్ధ కళ ఏది? దానిని చైనాకు తీసుకువెళ్ళాడని చెప్పబడే బౌద్ధ సన్యాసి ఎవరు?
5. ఏ ఇంట్లో ఉంటే ఆ ఇల్లు తమదనుకుని, ఏ మనుషులతో మసలితే, ఆ మనుషులు తమవాళ్ళనుకుని అంకిత భావంతో కృషి చేసే వాళ్ళ మాటలే మంచి ఫలితాలిస్తాయి– అన్న సత్యాన్ని ఒక అందమైన పూలకథ వివరిస్తుంది. ఆ కథ పేరేమిటో చెప్పగలరా?

6. ఈ చిత్రం ఏ కథలో చోటుచేసుకున్నది?





# యాచన

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు ఒక పల్లెటూరి బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. అతని పేరు సోమదత్తుడు. అతని తండ్రి అతి బీద వాడు. రెక్కలు ముక్కలు చేసుకుని తనకున్న కుంటపొలమూ సేద్యం చేసుకుని అతి కష్టం మీద ఎలాగో జీవించేవాడు.

సోమదత్తుడు పెరిగి పెద్దవాడై, తన తండ్రి కుటుంబ పోషణ కోసం పడే శ్రమ కళ్ళారా చూసి ఎంతో విచారించాడు. తన తల్లిదండ్రు లను సుఖపెట్టడానికి అతనికి ఒకటే మార్గం కనిపించింది. అదేమంటే, తాను ఎక్కడనైనా విద్య నేర్చుకుని కొలువులో ప్రవేశించటం. తాను కూడా తండ్రితో పాటు కష్టపడవచ్చు, కాని ఉన్న పొలం కొద్దిగనక ఫలితం ఉండదు. అందుకని సోమదత్తుడు తండ్రితో, "నేను తక్షశిలానగరం వెళ్ళి ఏదైనా విద్య నేర్చు కుంటాను," అన్నాడు. తండ్రి అందుకు సమ్మతించాడు.

సోమదత్తుడు తక్షశిల వెళ్ళి, ఒక గురువు వద్ద శుశ్రూష చేసి, కొన్నేళ్ళ పాటు శ్రద్ధగా విద్య నేర్చుకుని తిరిగి స్వగ్రామానికి వచ్చాడు. తన తండ్రి ఎప్పటిలాగే తనకు గల రెండు ఎద్దులతో ఆ కుంట పొలమే సాగుచేస్తూ, ఉదయం లగాయతు అస్తమయం దాకా శరీరశ్రమ చేస్తున్నాడు. ఇది చూసి సోమద త్తుడు, ఇక ఒక్కక్షణం కూడా ఉపేక్షించ రాదనుకుని, మర్నాడే బయలుదేరి కాశీ నగరం వెళ్ళి అక్కడ రాజు దగ్గిర కొలువులో ప్రవేశించాడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే సోమదత్తుడి తండ్రివద్ద ఉన్న రెండు ఎద్దులలో ఒకటి మరణించింది. ఎన్నో ఏళ్ళుగా తనను పోషిస్తూ, తన చేత పోషించబడుతూ ఉండిన ఎద్దు పోయేసరికి సోమదత్తుడి తండ్రికి ఒక చెయ్యి పడిపోయినట్టయింది. విచారంతో తీవ్రంగా ఆలోచించాడు. తన కొడుకు ప్రయోజకుడై రాజుగారి వద్ద కొలువు చేస్తు

న్నాడు గదా, రాజుతో చెప్పి ఒక్క ఎద్దును ఇప్పించలేక పోతాడా అనే ఉద్దేశంతో, సోమదత్తుడి తండ్రి అప్పటికప్పుడే కాశీ నగరానికి వెళ్ళి తన కొడుకును కలుసుకుని వచ్చిన పని గురించి చెప్పాడు.

జరిగినదంతా విని సోమదత్తుడు తండ్రితో, ''అమ్మా, నువ్వూ పెద్దవాళ్ళయి పోయారు. ఆ కాస్తభూమికోసం ఎందుకు తాపత్రయ పడతారు? మీరు కూడా వచ్చేసి నా వెంట వుండండి. ఏదో విధంగా జరిగిపోతుంది,'' అన్నాడు.

దానికి తండ్రిసుతరామూ ఒప్పుకోక, ''నేను ఆ గడ్డమీదనే పోవాలి. అది వదిలిపెట్టి రానే రాను. ఇంకొక ఎద్దును ఇప్పించావంటే మడి దున్నుకుంటూ హాయిగా కాలక్షేపం చేస్తాను. నాకు అక్కడ ఉండే శాంతి ఇక్కడ ఉండదు,'' అన్నాడు.

సోమదత్తుడు కొలువులో చేరి కొద్ది రోజులే అయి వుండటం చేత అతని వద్ద ఎద్దును కొనడానికి తగినడబ్బు లేదు. రాజును యాచించటం భావ్యంగా వుండదు. నిన్నగాకమొన్ననే వచ్చి అప్పుడే చెయ్యి చాస్తున్నాడని రాజుగారు అనుకోగలరు. అందుచేత అతను తండ్రితో, ''నేను రాజును ఎద్దుకోసం యాచిస్తే, 'నీకు ఎద్దుతో ఏంపని? ఎవరికోసం అడుగుతున్నావు?' అని ప్రశ్నలు వేస్తారు. అదీగాక కొలువు చేసేవారు యాచించటం ధర్మం కాదు, నీకీ బాధలేవీ లేవు. ఉన్న సంగతి అంతా చెప్పి, ఒక ఎద్దును దయ చేయించమని అడుగు. రాజు తప్పక ఇస్తాడు,'' అన్నాడు.



దీనికి తండ్రి ఒప్పలేదు. ''నాయనా, నేను పల్లెటూరి వాణ్ణి. నాకు నాగలి పట్టటం తప్ప మరేమీ తెలీదు. ఎక్కడ రాజుగారు, ఎక్కడ దర్బారు, ఎక్కడ నేను! నాకా సభలోకి అడుగు పెడితే నోటమాట కూడా రాదేమో. రాజుగారితో ఎట్లా మాట్లాడాలో, ఆ మర్యాద లేమిటో నాకేమైనా తెలుస్తాయా? వద్దు, వద్దు! ఎట్లాగో నువ్వే నాకు పని సానుకూలం చేసి పెట్టు,'' అన్నాడాయన కొడుకుతో.

''అదంతా ఇబ్బంది కాకుండా నేను ఒక పని చేస్తాను. నీకు ఒక శ్లోకం రాసి ఇస్తాను. దాన్ని రెండు మూడు రోజులు బాగా వల్లెవేసి రాజుగారి దగ్గరికి వెళ్ళి చదువు. నీ పని తప్పక సానుకూల మవుతుంది,'' అని సోమదత్తుడు తండ్రికి ధైర్యం చెప్పాడు. తరవాత అతను ఆ శ్లోకం రాసి తండ్రి చేత వల్లె వేయించాడు.

''ద్వే మేం గోణా, మహారాజ,
యేహి ఖేత్తం కసామసే;
తేసు ఏకో మతోదేవ,
దుతియం దేహి ఖత్తియ.''

దీని భావమేమంటే, ''మహారాజా, నాకు రెండు ఎడ్లుండేవి. వాటితో సేద్యం చేసుకునే వాణ్ణి. దేవా, ఇప్పుడు వాటిలో ఒకటి చచ్చి పోయింది. ఓరాజా, రెండో ఎద్దును ఇప్పించండి,'' అని.

ముసలివాడు చాలా శ్రమపడి ఈ శ్లోకాన్ని కంఠస్థం చేసుకున్నాడు. తరవాత సోమదత్తుడు తన తండ్రిని తనతో బాటు దర్బారుకు తీసుకువెళ్ళాడు.

కొడుకు చెప్పిన విధంగా ఆయన రాజుకూ, మంత్రులకూ నమస్కారాలు చేసి, చేతులు కట్టుకుని వినయంగా నిలబడ్డాడు.

''ఎవరు మీరు? ఏం కావాలి?'' అని రాజు అడిగాడు.

వెంటనే ముసలివాడు లోగడ వల్లె వేసిన శ్లోకం చదివాడు. కాని కంగారులో శ్లోకం గడగడా చెప్పడంతో కొద్దిగా మారిపోయి ఈ విధంగా తయారయింది.

''ద్వే మేం గోణా, మహారాజ,
యేహి ఖేత్తం కసామసే;
తేసు ఏకో మతోదేవ,
దుతియం గణ్హ ఖత్తియ.''

సభికులంతా నవ్వారు. సోమదత్తుడు సిగ్గుతో తల వంచుకున్నాడు. ఎందుచేతనంటే అతని తండ్రి కంగారులో, ''నాకు రెండో యెద్దును ఇప్పించండి,'' అనటానికి బదులు, ''నా రెండో ఎద్దును తీసుకోండి!'' అనేశాడు.

రాజు వృద్ధుడితో, ''నీ ఎద్దును నాకివ్వటాని కేనా ఇంటి నుంచి బయలుదేరి ఇంత దూరం వచ్చావు?'' అన్నాడు నవ్వుతూ.

''మహారాజా, కావలిస్తే మీరు దాన్ని తీసుకోండి. దానిమూలానే ఇంత గొడవ వచ్చింది,'' అంటూ జరిగినదంతా రాజుకు సోమదత్తుడి తండ్రి విన్నవించుకున్నాడు.

సోమదత్తుడి నీతివర్తనకు రాజు సంతోషించాడు. తన కొలువులో వున్న వాళ్ళంతా రాజును చీటికీ మాటికీ అదీ ఇదీ కావాలని కోరేవారే. సోమదత్తుడు అలా చేయలేదు. రాజు ఎనిమిది జతల యెడ్లను అలంకరింప చేసి, సోమదత్తుడి తండ్రికి దానం ఇచ్చేశాడు.





# రామాయణం

విశ్వామిత్రుడూ, ఆయన వెనకగా రామలక్ష్మణులూ ఒక కోసు దూరం నడిచి వెళ్ళి నిండుగా ప్రవహిస్తున్న సరయూనది దక్షిణపు గట్టు చేరుకున్నారు.

"నాయనా, రామా! నీవు వెంటనే ఆచమనం చేసి రా. నీకు బల, అతిబల అనే రెండు విద్యలిస్తాను. మంత్రాలతో కూడి ఉన్న ఈ విద్యలు నీకు అలసటా, జబ్బూ, రాకుండా చేస్తాయి. నీ రూపం చెక్కు చెదరకుండా ఉంచుతాయి. నిన్ను ఆపదల నుంచి కాపాడతాయి. ఆ మంత్రాలు జపిస్తూ ఉన్నంత కాలమూ నిన్ను మించిన అందగాడూ, తెలివిగలవాడూ, నేర్పరీ, వాదనలో నిన్ను మించగలవాడూ ప్రపంచంలో ఉండరు. ఆకలిదప్పు లుండవు. గొప్ప కీర్తి కలుగుతుంది," అన్నాడు విశ్వామిత్రుడు.

రాముడు సంతోషంతో ఆచమనం చేసి పరిశుద్ధుడై విశ్వామిత్రుడి నుంచి బల, అతిబలలను గ్రహించాడు. ఆ రాత్రికి వారు సరయూ తీరాన విశ్రాంతి తీసుకున్నారు.

తెల్లవారుతూనే విశ్వామిత్రుడు వారిని నిద్రలేపి, సరయూనదిలో స్నానాలు చేయించాడు. వారు తమ అనుష్ఠానాలు పూర్తి చేసుకుని విశ్వామిత్రుడి వెంట మళ్ళీ బయలుదేరి, సరయూనది గంగలో కలిసే చోటికి వచ్చారు.

అక్కడ ఒక ఆశ్రమం ఉన్నది. అక్కడ ఒకప్పుడు శివుడు తపస్సు చేసుకుంటూ ఉంటే మన్మథుడు ఆయన తపస్సుకు భంగం కలిగించటానికి వచ్చి, శివుడు తన మూడో కన్ను తెరిచేసరికి భస్మమైపోయాడు. అదిమొదలు ఆ ఆశ్రమంలో శివుడి శిష్యులైన



మునులుంటున్నారు. మన్మథుడు తన అంగాన్ని–అంటే శరీరాన్ని–అక్కడ పోగొట్టుకున్నాడు గనక, ఆ ప్రాంతానికి అంగదేశమనే పేరు వచ్చింది.

రామలక్ష్మణులు ఈ విషయాలన్నీ విశ్వామిత్రుడి ద్వారా తెలుసుకుని, ఆ రాత్రి ఆ ఆశ్రమంలో గడిపి, మర్నాడు ఒక పడవలో గంగను దాటారు. ఆ తరవాత వారు కాలినడకను ఒక భయంకరమైన అరణ్యం ప్రవేశించారు. ఎక్కడా జనసంచారం లేదు. విడవకుండా కీచురాళ్ళ అరుపులూ, సింహగర్జనలూ, పులుల గాండ్రింపులూ, అడవి పందుల గురగురలూ, ఏనుగుల ఘీంకారాలూ వినవస్తున్నాయి. చండ్ర, మద్ది, మారేడు, తుమ్మ, రేగు మొదలైన చెట్లు దట్టంగా పెరిగి మనుషులు చొర రాకుండా ఉన్నది ఆ అరణ్యం.

రాముడా అరణ్యాన్ని చూసి ఆశ్చర్యపడి విశ్వామిత్రుణ్ణి, ''మహామునీ, అతి భయంకరంగా కనిపిస్తున్న ఈ అరణ్యం పేరేమిటి?'' అని అడిగాడు.

విశ్వామిత్రుడు ఆ అరణ్యం కథ అంతా రామలక్ష్మణులకు వివరంగా చెప్పాడు:

ఆ ప్రాంతంలో ఒకప్పుడు మలదమూ, కరూశమూ అని రెండు గొప్ప దేశాలుండేవి. ఈ ప్రాంతాలలో తాటక అనే యక్షిణీ, దాని కొడుకు మారీచుడనేవాడూ చేరి రెండు దేశాలనూ నాశనం చేస్తున్నారు. వారికి భయపడి మనుషులెవరూ అటుకేసి రావటం లేదు. తాటక సామాన్యురాలు కాదు, వెయ్యి ఏనుగుల బలం కలది. అందుచేత అది సుభిక్షంగా ఉన్న రెండు దేశాలనూ మహారణ్యంగా మార్చగలిగింది.

ఈ మాట విని రాముడు, ''స్వామీ, యక్షులు అల్పశక్తి గలవారంటారు గదా, ఈ తాటక అనే యక్షిణికి వెయ్యి ఏనుగుల బలం ఎలా వచ్చింది?'' అని విశ్వామిత్రుణ్ణి అడిగాడు.

''నాయనా, తాటక వృత్తాంతం కూడా చెబుతాను, విను. సుకేతుడనే గొప్ప యక్షుడుండేవాడు. ఆయన బిడ్డలను కోరి గొప్ప తపస్సు చేశాడు. బ్రహ్మ ఆయన తపస్సుకు సంతోషించి, ఆయనకు కొడుకును ఇవ్వక, వెయ్యి ఏనుగుల బలంగల కూతురు కలిగే లాగు మటుకు వరమిచ్చాడు. బ్రహ్మవర ప్రభావం చేత సుకేతుడికి తాటక పుట్టి పెరగసాగింది. ఆమె యుక్తవయస్సు వచ్చి మంచి అందగత్తెగా తయారయింది. అప్పుడు సుకేతుడు

ఆమెను సుందుడనే యక్షకుమారుడి కిచ్చి పెళ్ళి చేశాడు. వారిద్దరికీ కొన్నాళ్ళకు మారీచుడనే కొడుకు కలిగాడు. వాడు పరాక్రమంలో ఇంద్రుణ్ణి పోలినవాడు, మితిమించిన గర్వం గలవాడు.

ఇలా ఉండగా ఒక సంగతి జరిగింది. ఈ ప్రాంతాలనే తపస్సు చేసుకుంటున్న అగస్త్యుడు తాటక భర్త అయిన సుందుణ్ణి చంపాడు. అందుకని తాటకా, మారీచుడూ అగస్త్యుడిపై ఆగ్రహించి, గట్టిగా అరుస్తూ ఆయనను తినేసేటట్టుగా మీదికి వచ్చారు. అప్పుడగస్త్యుడు వారిద్దరినీ రాక్షసులు కమ్మని శపించాడు. మారీచుడు రాక్షసుడైపోయాడు. తాటక తన అందమంతా కోల్పోయి భయంకరాకారం ధరించి, నరభక్షిణిగా మారిపోయింది. తాటక అగస్త్యుణ్ణి ఏమీ చెయ్యలేక ఆయన సంచరించిన ఈ పుణ్య భూమిని పాడుపెట్టేస్తూ బీభత్సం కలిగిస్తున్నది.అందుచేత, ఓ రామా, నీవా తాటకను వధించు. ఆడదని సంకోచించకు. ఆమె చేస్తున్న దుర్మార్గానికి అంతులేదు. ఆమెను చంపినందువల్ల నీకు కొంచెమైనా పాపం రాదు,'' అని విశ్వామిత్రుడు చెప్పాడు.

రాముడు చేతులు జోడించి, ''మహా మునీ, మాతండ్రి మీరు చెప్పినదెల్లా చెయ్యమని ఆజ్ఞాపించి మీ వెంట పంపారు. అందుచేత మీ ఆజ్ఞ చొప్పున అలాగే తాటకను చంపుతాను,'' అన్నాడు.

ఆ తరవాత రాముడు బాణంచేత పట్టి దాని తాడును బలంగాలాగి ఖంగు ఖంగుమని మోగించాడు.



ఈ చప్పుడు వినపడే సరికి తాటకా వనంలో ఉండేవారంతా ఉలిక్కి పడ్డారు. తాటక మండిపడి ఆ ధ్వని వినిపించిన వేపు అతి వేగంగా పరిగెత్తుకుంటూ వచ్చింది. అలా తమకేసి వచ్చే తాటకను చూసి రాముడు లక్ష్మణుడితో, ''చూశావా, లక్ష్మణా, ఈమె ఎంత వికారాకారం కలిగి, ధైర్యవంతులకు కూడా భీతి కలిగించేదిగా ఉన్నదో! అయినా, ఈ ఆడదాన్ని చంపడానికి నాకు చేతులు రావటంలేదు. దగ్గరికి రానీ, ముక్కూ, చెవులూ కోసి, పొగరు అణచి తరిమేద్దాం!'' అన్నాడు.

తాటక ఈ మాటలు విని మరింత ఉగ్రురాలై చేతులు పైకెత్తి రాముడి మీదికి వచ్చి, దుమ్ము చిమ్ముతూ రామలక్ష్మణులను కప్పేసి, వారిపై రాళ్ళవాన కురిపించ సాగింది. రాముడు దాని చేతులు రెండూ తన బాణా




లతో తెగగొట్టాడు. లక్ష్మణుడు అతి కోపంతో దాని ముక్కూ, చెవులూ కోసేశాడు. కాని మాయావి అయిన తాటక వాళ్ళపై మళ్ళీ రాళ్ళవాన కురిపించసాగింది.

అప్పుడు విశ్వామిత్రుడు, ''రామా, ఈ పాపాత్మురాలిని దయతలుస్తావేమిటి? ఇది ప్రాణాలతో ఉంటే ఇంకా ఎన్ని మాయలైనా చెయ్యగలదు. సంధ్యాకాలం లోపల దీన్ని చంపెయ్యి. ఉదయవేళా, సాయం సమయానా రాక్షసులకు బలం హెచ్చు. ఆ సమయంలో వారిని జయించటం కష్టం,'' అని హెచ్చరించాడు.

ఈమాట విని రాముడు తాటక రొమ్ములోకి ఒక్క బాణం బలంగా కొట్టాడు. ఆ దెబ్బతో అది నేలమీద పడి, గిలగిలా తన్నుకుని ప్రాణాలు వదిలింది.

విశ్వామిత్రుడు పరమానందభరితుడై రాముణ్ణి దగ్గరికి తీసుకుని, తల వాసన చూసి, ''నాయనా, ఈ దుష్టురాలిని చంపి చాలా మేలు చేశావు. ఈ రాత్రికి మనం ఇక్కడనే ఉండి, తెల్లవారి మన ఆశ్రమానికి పోదాం,'' అన్నాడు.

మర్నాడు వేకువజామునే ఆయన రాముణ్ణి లేపి, తాను శుచి అయి, తూర్పు ముఖంగా కూచుని రాముడికి అనేక అస్త్రాల తాలూకు మంత్రాలు ఉపదేశించి, జపం చేశాడు. అంతలోనే ఆ అస్త్రాలన్నీ రాముడి ఎదట తమ రూపాలతో నిలబడి, చేతులు జోడించి, ''మేము నీ భృత్యులం. ఏ పని చెబితే అది చేస్తాం,'' అన్నాయి. రాముడు ఆ అస్త్రాలను చేతితో తాకి, ''ఇప్పటికి మీరంతా నా మనసులో చేరి ఉండండి,'' అని చెప్పాడు.

తరవాత రాముడు విశ్వామిత్రుడి నుంచి అస్త్రాలను ఉపసంహరించే మంత్రాలు కూడా అడిగి తెలుసుకున్నాడు. తరవాత వారు ముగ్గురూ ప్రయాణం సాగించారు.

వారు కొంతదూరం పోయేసరికి ఒక కొండ పక్కగా ఒక అందమైన వనం కనిపించింది. రాముడది చూసి, ''స్వామీ, ఈ వనం చూస్తే నాకెంతో ఆనందంగా ఉన్నది. ఇది ఒక ఆశ్రమ మనికూడా తోస్తున్నది. దీని కథ ఏమిటి?'' అని అడిగాడు. విశ్వామిత్రుడు ఈ విధంగా చెప్పాడు:

''నాయనా, పూర్వం విరోచనుడి కొడుకైన బలి మహా బలపరాక్రమశాలి అయి, మూడు లోకాలనూ జయించి స్వర్గలోకం ఆక్రమించే సరికి, మహావిష్ణువు కశ్యపుడికి వామనుడుగా పుట్టి, బలి చేసే మహాయాగానికి వెళ్ళి బలిని మూడడుగుల భూమి యాచించాడు. బలి ఇచ్చాడు. వామనుడు మూడడుగులూ కొలిచి మూడు లోకాలూ పుచ్చుకుని బలిని అధోలోకానికిపంపేశాడు. ఆ వామనుడూ, ఆయన తండ్రి కశ్యపుడూ కూడా ఈ ఆశ్రమంలోనే దీర్ఘ తపస్సు చేశారు. అందుచేత నేను కూడా ఇక్కడే ఆశ్రమం ఏర్పాటు చేసుకున్నాను. రాక్షసులు మాటి మాటికీ వచ్చి నన్ను చాలా క్షోభపెడుతున్నారు. వారందరినీ నీవు చంపాలి.''

విశ్వామిత్రుడుంటున్న ఆశ్రమం పేరు సిద్ధాశ్రమం. విశ్వామిత్రుడు రామలక్ష్మణు లతో సహా ఆశ్రమం ప్రవేశించగానే అక్కడ ఉండే మునులందరూ సంతోషంతో పరిగెత్తు కుంటూ వచ్చి విశ్వామిత్రుణ్ణి పూజించి, రామలక్ష్మణులకు అతిథి సత్కారాలు చేశారు. రామలక్ష్మణులు కొంచెంసేపు విశ్రమించి



ప్రయాణపు బడలిక తీర్చుకుని, విశ్వామిత్రుడి వద్దకు వచ్చి నమస్కారం చేసి, ''మహామునీ, ఇక మీరు యాగం సాగించే ప్రయత్నాలు చేయవచ్చు. మీ యాగాన్ని మేము రక్షిస్తాము,'' అని చెప్పారు.

ఆ రాత్రి గడిచింది. రామలక్ష్మణులు లేచి, సంధ్యానుష్ఠానాలన్నీ ముగించి విశ్వామిత్రుడి వద్దకు వచ్చేసరికి ఆయన అప్పటికే హోమం ముందు కూచుని ఉన్నాడు. వారు విశ్వామిత్రుడికి నమస్కరించి, ''మహాత్మా, రాక్షసులు ఎప్పుడు వస్తారు? వాళ్ళ కోసం మేము ఏ సమయాలలో కాచుకుని ఉండాలి?'' అని అడిగారు.

విశ్వామిత్రుడు జవాబు చెప్పలేదు, కాని యజ్ఞవేదిక చుట్టూ చేరిన మునులు రామలక్ష్మణులతో, ''నాయనలారా, విశ్వామిత్రుడు యాగదీక్షలో ఉండటంచేత మౌనంగా ఉండాలి. ఇవాళ మొదలు ఆరు రోజులదాకా ఎలాంటి విఘ్నాలూ రాకుండా మీరు మమ్మల్ని కాపాడాలి,'' అని చెప్పారు.

రామలక్ష్మణులు పెద్ద పెద్ద బాణాలు ధరించి, ఎంతో జాగ్రత్త వహించి రాత్రివేళ నిద్రకూడా మాని అయిదు పగళ్ళూ, అయిదు రాత్రులూ ఆశ్రమాన్ని కాపాడారు. ఆరో రోజు వచ్చింది.

యజ్ఞశాలలో అగ్ని దేదీప్యమానంగా వెలుగుతున్నది. విధియుక్తంగా, మంత్రోక్తంగా యాగం నడుస్తున్నది. ఆ సమయంలో ఆకాశం నుంచి పెడబొబ్బలు వినిపించాయి. సుబాహు మారీచులూ, వారి బలగానికి చెందిన రాక్షసులూ కారుమేఘాల లాగా ఆకాశం ఆవరించి యజ్ఞవేదికపై రక్తవర్షం కురిపించసాగారు.

రాముడు రాక్షసుల ఆర్భాటాలు విని, తల ఎత్తి ఆకాశంలోని రాక్షసమూకను చూశాడు. అతను మానవాస్త్రం ఎక్కుపెట్టి మారీచుణ్ణి కొట్టాడు. ఆ దెబ్బకు వాడు వెళ్ళి సముద్రంలో పడ్డాడు. తరవాత రాముడు ఆగ్నేయాస్త్రంతో సుబాహుణ్ణీ, వాయవ్యాస్త్రంతో మిగిలిన రాక్షసులనూ చంపేశాడు. విశ్వామిత్రుడి యాగం పూర్తి అయింది. ఆయన రాముడితో, ''నాయనా, నాకు చాలా గొప్ప ఉపకారం చేశావు,'' అంటూ అతన్ని ప్రశంసించాడు.





# తాయత్తు మహిమ

ఒకనాటి ఉదయం ఒక నగరంలోకి ఒక అతి స్థూలకాయుడు ప్రవేశించాడు. అంతటి ఒడ్డూ, పొడుగూ ఏ మానవ మాత్రుడికీ ఉండదు. ఈ స్థూలకాయుడు ఒంటి నిండా నల్లటి బట్ట కప్పుకుని ఉన్నాడు. వాడి లావుపాటి జబ్బకు ఒక తాయత్తు కట్టి ఉన్నది.

వాడు అతి కష్టం మీద తన స్థూల శరీరాన్ని ముందుకు నడిపిస్తూ, ''తాయత్తు మహిమ తెలుసుకోవాలంటే త్వరగా రండి,'' అని అరుస్తున్నాడు. కాని వాడు మాయగాడేమో నని భయపడి, ఎవరూ వాణ్ణిసమీపించలేదు.

అయితే, ఆ ప్రాంతంలో ఏకాకిగా నివసిస్తున్న మరిడయ్య అనేవాడు, తాయత్తు మహిమ తెలుసుకోవాలని కుతూహలం పుట్టి, స్థూలకాయుడితో, ''అబ్బీ, తాయత్తు మహిమ ఏమిటో నాకు చూపించు,'' అన్నాడు.

స్థూలకాయుడు, ''నావెంటరా!'' అంటూ మరిడయ్యను ఊరి బయటికి తీసుకుపోయి, మర్రిచెట్టు కింద ఆగి, తన జబ్బకు కట్టి ఉన్న తాయత్తు విప్పాడు. అంత పెద్ద జబ్బకు సరిపోయిన తాయత్తు మామూలు మనిషి జబ్బకు సరిపోయే దానిలాగా చిన్నదై పోయింది.

''ఇదేనా తాయత్తు మహిమ?'' అని మరిడయ్య చప్పరించాడు.

''అప్పుడే ఏం చూశావు. నేను దీన్ని నీ జబ్బకు కట్టి వెళ్ళిపోతాను. నేను నీకు కనపడకుండా పోయినాక గాని, దీని మహిమ నీకు తెలీదు. నువ్వు దీన్ని వదిలించు కోవాలంటే మరెవడి జబ్బకైనా కట్టాలి గాని, మరో మార్గంలేదు;'' అంటూ ఆ స్థూలకాయుడు, మరిడయ్య ఏదో అడగబోతే కూడా వినిపించుకోకుండా, తాయత్తు మరిడయ్య జబ్బకు కట్టి, గబగబా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

వాడు వెళ్ళినవైపే చూస్తూ ఉండిన మరిడయ్య, తన జబ్బకు కట్టి ఉన్న తాయత్తును చూసి అదిరిపడ్డాడు. తరవాత తన శరీర మంతా కలయ చూసుకుంటే వాడికి మూర్ఛ




వచ్చినట్టయింది.మరిడయ్య అతిస్థూలకాయుడు అయిపోయాడు.

మరిడయ్య నెత్తీ, నోరూ బాదుకుంటూ ఆ మనిషి వెళ్ళినవేపే ఆయాసపడుతూ పరిగెత్తాడు. వీధి మలుపు తిరిగే సరికి దూరంగా ఒక సన్నని మనిషి నల్లబట్టకప్పుకుని పోతూ కనిపించాడు. మరిడయ్యకు తాయత్తు మహిమ తెలిసింది. తాయత్తును వదిలించుకుంటే స్థూలకాయం పోయి, మామూలు మనిషి కావచ్చు.

తన ఇంటి కేసి తిరిగి వచ్చిన మరిడయ్యను చూసి ఎరిగినవాళ్ళు నిర్ఘాంత పోయి, ''ఇందులో ఏదో మోసం ఉందని మేం ముందే అనుకున్నాం. ఆ దరిద్ర గొట్టు తాయత్తును వెంటనే తెంపి అవతల పారెయ్యి,'' అన్నారు.

మరిడయ్య తాయత్తును విప్పి దూరంగా గిరవాటు వేశాడు. కాని అది వెంటనే వచ్చి మరిడయ్య జబ్బకు అంటుకున్నది. అంతే కాదు, ఇప్పుడది నిప్పులా కాలటం మొదలు పెట్టింది. మరిడయ్య దాన్ని తీసే ప్రయత్నం మానుకున్నాకనే అది చల్లబడింది.

మరిడయ్యకు పెద్ద చిక్కే వచ్చింది. నెల పొడుగునా తినటానికి తెచ్చుకున్న తిండి గింజలు రెండు రోజులు కూడా రాలేదు. కాయకష్టం చేసుకునే మరిడయ్య కదల్చటానికే సాధ్యంకాని స్థూలశరీరంతో నానా అవస్థా పడవలసి వచ్చింది. ఒక్క తిండికే తనకున్నదంతా అమ్ముకుని, మరిడయ్య తనకిక చావు తప్ప శరణ్యం లేదనుకుని, ఊరి బయట ఉన్న మర్రిచెట్టు కిందికి చేరి, చావుకోసం ఎదురు చూడసాగాడు.

అపరాహ్ణం వేళ, పొరుగూరి నుంచి అటుగా వస్తున్న ఒక బక్కచిక్కి ఉన్న మనిషి మర్రిచెట్టు కింద ఆగి, మరిడయ్య శరీరం కేసి చూసి, ''గురువుగారూ, నా పేరు వెంకయ్య. ఒళ్ళు లావెక్కటానికి చిట్కా ఏమన్నా ఉంటే చెబుతారా? అస్థిపంజరంలా ఉండటం చేత నాకు పెళ్ళి కాకుండా ఉన్నది,'' అన్నాడు.

ప్రాణంలేచి వచ్చినట్టయి, ''అంతా తాయత్తు మహిమ!'' అన్నాడు మరిడయ్య.

''ఆ మహిమ ఏమిటో నాకు చూపిద్దురూ,'' అన్నాడు వెంకయ్య.

మరిడయ్య తన జబ్బకు ఉన్న తాయత్తు విప్పి, వెంకయ్య జబ్బకు కట్టుతూ, ''నేను కనుమరుగైవెళ్ళిపోయాకగాని, దీని మహిమ నీకు తెలియదు. నువ్వు ఈ తాయత్తును

వదిలించుకోవాలంటే దాన్ని మరొకరి జబ్బకు కట్టవలిసి ఉంటుంది. దాన్ని పొరపాటున కూడా ఊడతీసి పారెయ్యకు, నిప్పు కాల్చి నట్టు నిన్ను కాల్చుతుంది,'' అని చెప్పి, తన దారిన తాను ఇంటికి వెళ్ళిపోయాడు.

అతను కనపడకుండా పోయినదాకా చూసి తన శరీరం కేసి చూసుకునే సరికి వెంకయ్యకు తల తిరిగినట్టయింది. అతని శరీరం అతి స్థూలంగా తయారయింది. అతను తన ఊరు వెళ్ళాడు గాని, అంత స్థూలంగా ఉన్న వాడికి ఎవరూ పిల్ల నిచ్చారు కారు. హతాశుడై వెంకయ్య తిరిగి నగరం చేరుకున్నాడు.

వెంకయ్యకు కూడా తిండి సమస్య ఏర్ప డింది. కాషాయవస్త్రాలు ధరించి, ఇల్లిల్లూ తిరిగి ముష్టి ఎత్తుతూ, జీవించసాగాడు. ఒకనాడు వెంకయ్య ఒక ఇంటి తలుపు తట్టాడు. ఆ ఇంట్లో ఒక బ్రహ్మచారిణి ఉంటు న్నది. ఆమె వికారి కావటం చేత పెళ్ళికాలేదు. ఆమె తలుపు తెరిచి, వెంకయ్య కాషాయ వస్త్రాలు చూసి, ''అందంగా కనిపించటానికి కిటుకు ఏమైనా ఉన్నదా, స్వామీ?'' అన్నది.

వెంకయ్య బుర్ర మెరుపులా పనిచేసింది. ''లేకేమి? తాయత్తు ఉన్నది,'' అన్నాడు.

''ఆ తాయత్తు నా కిచ్చి పుణ్యం కట్టు కోండి,'' అన్నది బ్రహ్మచారిణి.

వెంటనే వెంకయ్య తన తాయత్తు విప్పి ఆమె జబ్బకు కట్టుతూ, ''నేను కనిపించ కుండా వెళ్ళిన తరవాతనే ఈ తాయత్తు మహిమ నీకు తెలుస్తుంది. దీన్ని వదిలించా లంటే మరొకరి జబ్బకు కట్టటం తప్ప మార్గాం తరం లేదు,'' అని చెప్పి, వెళ్ళిపోయాడు.




బ్రహ్మచారిణి లోపలికి వెళ్ళి, తన అందం చూసుకోవటానికి నిలువుటద్దం ముందు నిలబడి, తుళ్ళి పడింది. అంత నిలువు అద్దంలోనూ ఆమె శరీరంలో నాలుగో వంతు కూడా కనపడటం లేదు. ఆమె శోకాలు పెట్టింది. చుట్టుపక్కల వాళ్ళు వచ్చి ఆమెను చూశారు. అలా వచ్చినవారిలో ఆ నగరపు యువరాణి పరిచారిక కూడా ఉన్నది. బ్రహ్మ చారిణిని చూడగానే ఆమె విరగబడి నవ్వుతూ, ''యువరాణీ వారు నవ్వి నాలుగేళ్ళయింది. నిన్ను చూస్తే ఆమె తప్పక నవ్వుతుంది,'' అన్నది. ఆమె బ్రహ్మచారిణిని ఉద్యానవనంలో ఉన్న యువరాణి వద్దకు తీసుకుపోయింది.

భూతకిలా ఉన్న బ్రహ్మచారిణి ఒయ్యా రంగా నడుస్తూ వస్తూ ఉండటం చూడగానే యువరాణి గల గలా నవ్వి, ''ఇంతకాలానికి

నన్ను మళ్ళీ నవ్వించగలిగావు. నీలో ఏం మహత్తు ఉన్నది?'' అని బ్రహ్మచారిణిని అడిగింది.

''మహత్తు నాది కాదు, తాయత్తుది,'' అన్నది బ్రహ్మచారిణి.

''ఏదీ? ఆ తాయత్తు ఒక్కసారి చూస్తాను. ఇలా ఇయ్యి,'' అని యువరాణి అడిగింది.

''కట్టుకుని మరీ చూడండి,'' అంటూ బ్రహ్మచారిణి తన తాయత్తు తీసి యువరాణి జబ్బుకు కట్టి, ''మరొకరి జబ్బకు కట్టినప్పుడే ఇది మిమ్మల్ని వదులుతుంది,'' అని చెప్పేసి, వేగంగా తన ఇంటికి వెళ్ళిపోయింది.

యువరాణి పల్లకి ఎక్కి, రాజభవనానికి బయలు దేరింది. కొద్దిదూరం పోయేసరికే బోయీలకు పల్లకి బరువు మోయరానంత అయిపోయి దాన్ని కింద పడేశారు. యువ రాణి భూతకిలా లేచింది. తన తండ్రిని చూడ గానే యువరాణి బావురుమని ఏడుస్తూ, జరిగిన సంగతి చెప్పింది.

ఒక్కగా నొక్క కూతురు పరిస్థితి చూడలేక రాజు తాయత్తును తెంపి దూరంగా పారే శాడు. కాని మరుక్షణమే అది వచ్చి యువ రాణి జబ్బకు కరుచుకుని, నిప్పులా కాల్చ సాగింది. ఆమె పడేబాధ సహించలేక, రాజు ఆ తాయత్తును తానే కట్టుకున్నాడు. యువ రాణి ఎప్పటిలా నాజూకుగా తయారయింది గాని, రాజు స్థూలకాయుడై పోయాడు. రాజుగారు కనక తిండి సమస్య లేదుగాని, దుస్తులూ, సింహాసనమూ, కిరీటమూ, ప్రతిష్ఠ సమస్యలై కూర్చున్నాయి.

మర్నాడు ఆయన బ్రహ్మచారిణిని ప్రశ్నించి, తాయత్తును ఆమెకిచ్చిన వెంకయ్యను అడిగి, అతనికిచ్చిన మరిడయ్య ఆరా తీయించి, మరిడయ్యకు తాయత్తు అంటగట్టిన వాణ్ణి గురించి తెలుసుకోలేక పోయాడు. చివరకు ఆయన నిండు సభలో తాయత్తు గురించి చెప్పి తన తాయత్తు కట్టించుకున్న వాడికి తిండి వగైరా ఏర్పాట్లు చేస్తానన్నాడు.

అప్పుడు ఒక మనిషి తాయత్తు కట్టించుకు నేటందుకు ముందుకు వచ్చాడు. వాడే మరిడ య్యకు తాయత్తు అంటగట్టిన వాడు. వాడు మళ్ళీ స్థూల శరీరం తెచ్చుకుని, హాయిగా రాజమందిరంలో తింటూ, యువరాణిని వినోదపరుస్తూ జీవించాడు.




అజేయుడు గరుడుడు! 2
చిత్రాలు: గాంధి అయ్య
1
చంద్రపురిరాజు మహేంద్రదేవుడు, దివంగత ప్రధానమంత్రి కుమారుడు ఆదిత్యుడు తమ రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించ గలడని ప్రకటించాడు. తన దత్తపుత్రిక అరుణను, ఆదిత్యుడు వివాహమాడగలడని కూడా రాజు తన కోరికను వెలిబుచ్చాడు.
అంతకు పూర్వం..... రాజ్యంలో అల్లకల్లోలాన్ని సృష్టించడానికి కుట్రపన్నిన నాగబంధు అగ్నికి ఆహుతయ్యాడు. నాగబంధు గుహాలయం కూలిపోయింది. తన కుమారుడు రవీంద్రదేవుడికి రాజ్యసింహాసనాన్ని కట్టబెట్టాలన్న దురాశతో కుట్రపన్నిన సేనాధిపతి నరేంద్రదేవుడు మొసళ్ళవాతబడి రెండు కాళ్ళూ పోగొట్టుకున్నాడు. రవీంద్రదేవుడూ, భూతవైద్యుడూ బందీలుగా పట్టుబడ్డారు. ఆదిత్యుడు జయప్రదంగా చంద్రపురికి తిరిగి వచ్చాడు. చంద్రపురిలో శాంతి నెలకొన్నది....
అయితే..... ఇప్పుడు రాజ్యంలో మళ్ళీ దుష్టశక్తులు తలెత్తి అశాంతినీ, అలజడినీ పుట్టించడానికి ప్రచ్ఛన్నంగా పథకాలు రూపొందించసాగాయి. అసలైన కుట్రదారులు ఎవరు? ఈ పోరాటంలో జయించబోయేది కుట్రలూ, కుయుక్తులూ గల దుష్టశక్తులా? గరుడుడు ఇష్టదైవంగాగల సాహస వీరుడైన ఆదిత్యుడు మళ్ళీ అజేయుడు కాగలడా? ఈ సంచికనుంచి చదవండి!


మళ్ళీ చంద్రపురిలో అడుగుపెట్టనని బతిమాలడంతో భూతవైద్యుణ్ణి విడిచిపెట్టారు.


రవీంద్రదేవుడు క్షమాభిక్ష వేడుకున్నాడు.
ప్రభూ, కరుణించి క్షమించండి.


మహారాజు, రవీంద్రదేవుణ్ణి మందలించాడు.
రవీంద్రదేవా, నువ్వు రాజద్రోహం నేరానికి పాల్పడ్డావు. నువ్వు నా మేనల్లుడివి గనక, ప్రాణాలతో విడిచిపెడుతున్నాను. అయితే, ఈ క్షణమే చంద్రపురి నుంచి బహిష్కరిస్తున్నాను!


రవీంద్రదేవుణ్ణి తీసుకుపోయి, రాజ్యం సరిహద్దులు దాటి వదిలిపెట్టారు.




అయ్యయ్యో! సంకెళ్ళు తొలగించకుండానే వెళ్ళిపోతున్నారే!


రవీంద్రదేవుడు అక్కణ్ణించి కదలలేకపోయాడు.
నాకు సాయపడే వాళ్ళేలేరా?
నేను ఉన్నాను రవీంద్రదేవా!


రవీంద్రదేవుడు భూతవైద్యుణ్ణి గుర్తుపట్టాడు...
రవీంద్రా, నాకున్న శక్తులతో నీ కదలికలను గమనిస్తూనే ఉన్నాను. అయినా, భటులు నన్ను చూడకూడదు కదా అందువల్ల చాటున దాక్కుని ఉన్నాను.
ఆహా! ఏమి నా అదృష్టం! నా సంకెళ్ళు తొలగించండి!


నిన్ను నా కోయ మిత్రుల వద్దకు తీసుకువెళతాను. వాళ్ళు నీకు సాయపడగలరు.


రవీంద్రదేవుణ్ణి ఒక గాడిద మీద కోయవాళ్ళున్న గూడానికి తీసుకువెళ్ళాడు.


అయ్యో, మిమ్మల్ని నాగబంధు ఆత్మే కాపాడి ఉంటుంది!


రవీంద్రదేవుడి కాళ్ళు చేతుల కున్న సంకెళ్ళను తొలగొట్టారు.
ఆహా! బతికిపోయాను.


రవీంద్రదేవుడు తాగడానికి పానీయం ఇచ్చారు.


మానాన్న ఎలా ఉన్నాడు? ఆయన ఆచూకీ ఏమైనా తెలిసిందా?
ఆయన ప్రాణాలతోనే ఉన్నాడు. కాని, నడవలేడు.


సర్పదేశాన్ని సమీపిస్తూండగా పడవ తల్లకిందులు కావడంతో, నదిలోని భయంకరమైన మొసళ్ళు ఆయన కాళ్ళను తినేశాయి!
ఎక్కడవున్నా సరే, ఆయన్ను నేను వెంటనే చూడాలి!


ఆయన ఒక కొండ గుహలో ఉన్నాడు. నిన్ను అక్కడికి తీసుకువెళతాం.


ముందు ఇద్దరు కోయవాళ్ళు దారితీయగా, భూతవైద్యుడూ, రవీంద్రదేవుడూ వారిని అనుసరించారు.
ఇది చాలా దుర్గమమైన మార్గమే. అయినా, కోయవాళ్ళు ఆయనకు ఎలాగో ఆహారం అందిస్తూనే ఉన్నారు.


ఆదిత్యుడు కొందరు ప్రముఖులతో ఏదో చర్చిస్తూండగా, భవనం కాపలాభటుడొకడు లోపలికి వచ్చాడు.
తమ దర్శనం కోసం కోయ దంపతులు వచ్చారు, ప్రభూ!
వాళ్ళను లోపలికి తీసుకురా.


మీరు ఇప్పుడు వెళ్ళవచ్చు. తరవాత కలుద్దాం!


ఆదిత్యుడు కోయ దంపతులను గుర్తుపట్టాడు. యజ్ఞకుండం అగ్నికి ఆహుతి కాకుండా ఆమె భర్తను ఆదిత్యుడు కాపాడాడు.
క్షేమంగా ఉన్నారా? సమస్యలేవీ లేవుకదా!
లేవు ప్రభూ, మాగూడెంలో బతుకు హాయిగా సాగిపోతోంది!
మీకో సమాచారం అందజేయడానికే హడావుడిగా వచ్చాం.


తమ పట్టాభిషేకోత్సవాన్ని భగ్నపరచడానికి కొందరు పథకం వేస్తున్నారు.
ఎవరు వాళ్ళు?


ఎవరో కాదు. మా కోయ గూడెంవాళ్ళే! భూతవైద్యుడనే వాడు వాళ్ళను పెడమార్గం పట్టిస్తున్నాడు!


సేనాధిపతి కొడుకుతో అతడు ఉండడం మేం చూశాం.
వాళ్ళను మా వాళ్ళు, కాళ్ళులేని మనిషి ఉంటూన్న గుహ వద్దకు తీసుకువెళ్ళారు.


అలాగా! రవీంద్రదేవుడూ, వాడి తండ్రీ మళ్ళీ ఒకటయ్యారా?
-(ఇంకాఉంది)

మనదేశపు సాంస్కృతిక ఉత్సవాలు

# నృత్య సంగీత సమయం



రెండు ఉత్సవాలు ఒకటి ఉత్తర భారతదేశంలో, రెండవది దక్షిణ భారతదేశంలో ఫిబ్రవరిలో ప్రారంభమై మార్చ్ నెలలో ముగియనున్నాయి. అవి-మధ్యప్రదేశ్‌లో జరిగే ఖజురహో ఉత్సవం; ఆంధ్రప్రదేశ్‌లో జరిగే దక్కను ఉత్సవం. ఖజురహో ఒకప్పుడు బుందేల్‌ఖండ్ ప్రాంతాన్ని పరిపాలించిన శక్తివంతులైన చండేలా వంశానికి మతరాజధానిగా ఉండేది. అక్కడి దేవాలయాలను పశ్చిమ, తూర్పు, దక్షిణ సముదాయాలుగా వర్గీకరణ చేస్తారు. ఇవి వెయ్యి సంవత్సరాలకు పూర్వం నిర్మించబడ్డాయి. ఇక్కడి సుప్రసిద్ధమైన రాతి శిల్పాలు ప్రధానంగా సంగీత నృత్యకళాపోషకులైన రాజపుత్రుల జీవితాలను, విభిన్న భావావేశాలను, మత విశ్వాసాలను ప్రతిబింబిస్తాయి. నయనానందకరమైన దీపాలంకరణలు చేసిన దేవాలయాల నేపథ్యంగా ఒక వారం రోజుల పాటు జరిగే నృత్యోత్సవాలు కథక్, మణిపురి, ఒడిస్సీ, కూచిపూడి, భరతనాట్యం, కథకళి మొదలైన విభిన్న నాట్యరీతులలోని సుసంపన్నతను చాటుతాయి. వివిధ నాట్యరీతులలో లబ్ధ ప్రతిష్ఠులైన ఉత్తమ కళాకారులు ఈ నృత్యోత్సవంలో పాల్గొంటారు. చిత్రగుప్త ఆలయం అనే సూర్య దేవాలయం ఎదుట, విశ్వనాథ (శివ) ఆలయం ఎదుట బహిరంగ వేదికపై నృత్యప్రదర్శనలు జరుగుతాయి. ఈ ప్రాంతానికి చెందిన హస్తకళానిపుణులు ఈ ప్రాంతానికే ప్రత్యేకమైన హస్తకళలను ప్రదర్శిస్తారు. ఖజురహో సాంస్కృతిక వారసత్వాన్ని పరిరక్షించి భావితరాలకు తెలిసేలా చేసి, వారికి అప్పగించాలన్నదే ఈ నృత్యోత్సవాల ఆశయం.



హైదరాబాదులో ఐదు రోజుల పాటు జరిగే దక్కను ఉత్సవాలు దక్కను సంస్కృతినీ, అక్కడి కళలు, హస్తకళలు సంగీతం నృత్యం మొదలైన వాటినీ ప్రతిబింబిస్తాయి. ముస్లిం పాలకులనాటి కళాభిరుచిని గుర్తు చేసుకునే విధంగా ఈ నగరానికే ప్రత్యేకమైన ఘజల్స్, ఖవాలిస్, ముషైరాస్ గానం చేయడం ఈ ఉత్సవ ప్రత్యేక ఆకర్షణ. ముత్యాలకూ, అద్దం గాజులకూ హైదరాబాదు చాలా ప్రసిద్ధిగాంచింది గనక, వీటి ప్రదర్శన తప్పక ఉంటుంది. ఈ నగరానికే ప్రత్యేకమైన హైదరాబాదీ, నవాబీ వంటకాలతో ఏర్పాటు చేసే ఆహార విభాగం ప్రజలను ఎంతగానో ఆకర్షిస్తుంది. ఈ ఉత్సవాన్ని ఆంధ్రప్రదేశ్ పర్యాటక శాఖ ఏర్పాటు చేస్తున్నది.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....



## విజ్ఞాన వీచికలు :

### 'ముళ్ళవీపు' ఆదిమ ప్రాణి

డైనోజార్స్ అనే రాక్షస బల్లులు ఇప్పుడు లేవు గాని, టుయెటరాస్ ఉన్నాయి. న్యూజీల్యాండ్‌లో మాత్రమే ఇవి కనిపిస్తాయి. టుయెటరాస్ అంటే మావోరీ భాషలో 'ముళ్ళవీపు' అని అర్థం. ఈ టుయెటరాస్ డైనోజార్స్ కాలం నుంచే ఉన్నాయి. దాదాపు 220 మిలియన్ సంవత్సరాలుగా మార్పు చెందకుండా ఉన్న ప్రాణి బహుశా ఇదొక్కటే అని శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

టుయెటరాస్ ప్రాకుడు జంతువే అయినప్పటికీ బల్లితోగాని, మొసలితో గాని అంతగా పోలిక కనిపించదు. దాని శరీరం ఆదిమ కాలపు ఆకారం కలిగి ఉన్నది. చర్మం వదులుగానూ, పై భాగం పొలుసుల తోనూ ఉంటుంది. మారే స్వభావంగల దాని శరీర ఉష్ణోగ్రత దానికి అత్యంత శీతల వాతావరణాన్ని కూడా తట్టుకునే శక్తినిస్తోంది.

ఇవి రాత్రుల్లో తిరుగుతాయి. పగటి పూట బొరియలలో దాగి ఉంటూ, రాత్రి సమయాల్లో ఆహారపు వేటకు బయలుదేరుతాయి. తల్లి టుయెటరాస్ గుడ్లు పెట్టి వాటిని వదిలేస్తాయి. పన్నెండు నెలల తరవాత గుడ్ల నుంచి పిల్లలు తమ పళ్ళతో గుడ్ల పైపెంకును పగుల గొట్టుకుని వెలుపలికి వస్తాయి. తమ ఆహారాన్ని తామే వెతుక్కుంటాయి. రెండు, మూడు, నాలుగు సంవత్సరాల కొకసారి టుయెటరాస్ గుడ్లు పెడతాయి.

## మన పరిసరాలు

### పొడి మబ్బుల అపాయం



ఆకాశంలో మబ్బులు కమ్మినంత మాత్రాన వానలు కురిసి తీరాలనే నిర్బంధం లేదు. ఇజ్రాయెల్‌కు చెందిన కొందరు శాస్త్రవేత్తలు–వాతావరణ కాలుష్యానికి పొడిమబ్బులు ఏర్పడేలా చేసి వర్షాన్ని అడ్డుకునే శక్తి ఉందని హెచ్చరిస్తున్నారు. వేడి ఆవిరి ఘనీభవించి నీటి చుక్కలుగా మారి కిందికి వచ్చేప్పుడు–బస్సులు, ఫ్యాక్టరీలు మొదలైన వాటి నుంచి వెలువడే పొగల మబ్బులలో మునిగి పోతాయట! పొగరేణువులు అసంఖ్యాకంగా ఉండడంతో అవి నీటి చుక్కలను చుట్టేసి పొడిమబ్బులు ఏర్పడేలా చేస్తాయి. వర్షాన్ని కిందికి కురవకుండా అడ్డుకుని ఆపేస్తాయి.

ఇజ్రాయెల్ శాస్త్రవేత్తలు ఈ పొడిమబ్బులను ఫోటోలు తీశారు. ఈ పొడిమబ్బులలోని నీటి బిందువుల పరిమాణం మామూలు నిర్మలమైన మేఘాలలోని నీటి బిందువుల పరిమాణంలో సగమే ఉన్నాయని ఈ చిత్రాలు తెలియజేశాయి!

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## మీకు తెలుసా?

### పిల్లిపాటు



ప్రమాదవశాత్తు ఎత్తయిన చోటునుంచి కింద పడే మనిషికి కాలూ, చెయ్యీ విరగవచ్చు; ప్రాణాపాయం కూడా వాటిల్లవచ్చు. అందుకే అలాంటి దృశ్యం కంటపడితే చూసేవారికి సైతం ఊపిరాడదు. దిగ్భ్రాంతికి లోనవుతారు. మిగతా జంతువుల స్థితీ ఇంతే. అయితే, పిల్లి మాత్రం ఎంత ఎత్తు నుంచి పడ్డా, కింద దర్జాగా నాలుగు కాళ్ళపై నిలబడగలదు. దాని శరీరానికి ఏమాత్రం దెబ్బ తగలదు. హాయిగా నడుచుకుంటూ వెళుతుంది. చూపరులకు ఎంతయినా వింత కలిగిస్తుంది. ఆశ్చర్యంగా ఉన్నా ఇది నిజం. పిల్లిలో ఉన్న అరుదైన అత్యంత శక్తివంతమైన స్పర్శజ్ఞానమే దీనికి కారణం. కింద పడుతున్నామని తెలియగానే, అది హెచ్చరించి శరీరాన్నంతటినీ అందుకు సమాయత్తపరుస్తుంది.

## మన దేశం క్విజ్



ఈ నెల క్విజ్‌లో
మన దేశంలోని వార్తాపత్రికల
గురించి తెలుసుకుందాం.



1. మన దేశంలో మొట్టమొదట వెలువడి, ఇంకా వస్తూన్న ప్రాంతీయ భాషా వార్తాపత్రిక ఏది? అది ఏ భాషలో వస్తోంది? ఎప్పుడు ప్రారంభించబడింది?

2. మనదేశంలో వెలువడిన మొట్టమొదటి వార్తాపత్రిక ఏది? దాని సంపాదకుడు ఎవరు?

3. 'ది హిందు' ఎప్పుడు ప్రారంభించబడింది? వ్యవస్థాపకులు ఎవరు?

4. మనదేశంలో వెలువడిన మొట్టమొదటి వార్తా దిన పత్రిక ఏది?

5. తమ ప్రాంతం నుంచి వెలువడే వార్తా పత్రిక అంటూ లేని రాష్ట్రం ఏది?

*(సమాధానాలు 70వ పేజీలో)*

# ఫోటో వ్యాఖ్యల పోటీ



ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని
వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



DHARM NATH PRASAD



DHARM NATH PRASAD

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా
మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఏప్రిల్ 2006 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

### డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

తామరపల్లి జయలక్ష్మి
**W/o.** కామేశ్వరరావు
41-17-1/12, సేవానగర్
నియర్ వెల్ నం. 7
విశాఖపట్నం - 530 004.
(ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:







మొదటి ఫోటో : అల్లితేనే కూడు!
రెండవ ఫోటో : ఎవరూ లేరు తోడు!!

## సమాధానాలు :

1. బొంబే సమాచార్, గుజరాతీ, 1822.
2. కలకత్తా జనరల్ అడ్వైజర్, 1780లో. జేమ్స్ అగస్టస్ హైకీ. తరవాత బెంగాల్ గజెట్‌గా పేరు మార్చబడింది.
3. 1878లో, కస్తూరి రంగ అయ్యంగార్ అనే న్యాయవాది; ఆయన కుమారుడు కె. శ్రీనివాసన్.
4. బొంబే హెరాల్డ్, 1789.
5. అరుణాచల ప్రదేశ్.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : B. Viswanatha Reddi (Viswam)

# తరగని శక్తి వనరు



వీణ తల్లిదండ్రులతో కలిసి తిరుపతికి వెళ్ళింది. క్యూలో చాలా సేపు నిలబడి ఏడుకొండల దేవుణ్ణి దర్శించుకున్నారు. సంతోషంగా గుడినుంచి వెలుపలికి వచ్చారు. ఆకలి వేయడంతో దేవస్థానం నిర్వహిస్తున్న అన్నదాన సత్రానికి వచ్చారు. అన్నం కోసం వేలాది మంది భక్తులు వరుసలో నిలబడడం చూసి వీణ ఆశ్చర్యపోయింది. అంత మందికి వడ్డిస్తున్నా అన్నం వేడివేడిగా ఆవిరులు చిమ్ముతూ ఉండడం వీణకు మరింత ఆశ్చర్యం కలిగించింది. ఇదెలా సాధ్యం అని ఆలోచిస్తూ, మామయ్య మోహన్‌ను అడిగింది. ఆయన తరచూ తిరుపతికి వస్తూంటాడు. "అందుకు మనం సూర్యుడికి కృతజ్ఞతలు చెప్పాలి," అన్నాడు మోహన్.

"అర్థమయ్యేలా చెప్పు మామయ్యా," అన్నది వీణ నవ్వుతూ.

భోజనం ముగించి, కాటేజ్ కేసి నడుస్తూ, "దానికి కారణం సౌరశక్తి. అంటే సూర్యుడు మనకు ఉచితంగా ఇస్తున్న శక్తి అన్నమాట! నువ్వెప్పుడూ 'సోలార్ సెల్స్' బొమ్మలు చూడనే లేదా? ఆ భవనం పైకప్పులో అమర్చిన వందలాది సోలార్ సెల్స్ ద్వారా, స్టీమ్ కుకర్స్‌తో అంటే ఆవిరి వంట పాత్రలతో వంట చేయడానికి అవసరమైన సౌరశక్తి లభిస్తోందన్న మాట.

"సౌర శక్తి ఉచితంగా లభించినప్పటికీ దాంతో వంట చేయడం కాస్త ఎక్కువ ఖర్చుతో కూడుకున్న వ్యవహారం కదా?" అన్నది వీణ అనుమానంగా.

"పోను పోను, మెరుగైన సాంకేతిక సాయంతో, మామూలుగా వంట గ్యాస్, లేదా విద్యుచ్ఛక్తి వంటి సంప్రదాయ పద్ధతులకన్నా, సౌరశక్తితో వంట చేయడం చవుకగా తయారవుతుంది. అంతే కాదు. సౌరశక్తి ఎంత వాడుకున్నా తరగదు. కాలుష్య రహితమైనది," అన్నాడు మోహన్.

"అంటే, మనం సౌరశక్తిని, మన ఇళ్ళల్లో కూడా ఉపయోగించుకోవచ్చున్న మాట! అవునా?" అన్నది వీణ.

"అవును, ఉపయోగించవచ్చు. దాన్ని గురించి తరవాత చెబుతాను," అన్నాడు మోహన్.

CHANDAMAMA (Telugu) FEBRUARY 2006
Regd. with Registrar of Newspaper for India No. 1114/57
Regd. No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No. TN/CC(S)Dn/84/06-08. Foreign No. 85/06-08